# క్రైస్తవారాధనదీపిక.



రెవరెండ్ ఈ. ఊనాంగస్టుదొరగారు, డి. డి.,

అ. స. కుగ్లరుమిశమ్మగారు, మ. డి.

రెవరెండ్ బి. జానుగారు

అనెడి

గుంటూరు అమెరికన్ లుతరన్ మిషన్ కన్ఫరెన్సు కమ్మిటి
వారివలన ప్రచురింపంబడియె.

తెనుగు వరుస రాగ తాళములతో రెవరెండ్ బి. జానుగారిచే
రచియింపబడిన కీర్తనలతోనితరులవలన రచియింపబడిన
పన్నెండును చేర్చబడినవి.

---

యెహోవానుగూర్చి క్రొత్తకీర్తనపాడుడి. కీర్తన 98: 1.

---

గుంటూరు:

అమెరికన్ లుతరన్ మిషన్ ముద్రాక్షరశాలలో
ముద్రింపంబడియె.

---

౧౮౮౪ సం॥

# స్తోత్రకీర్తనల పుస్తకమున తప్పొప్పులు.

| సంవత్సరము. | పుట | నెల | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 3 | 7 | ఏప్రిల్ | 2 | చిత్రప్రకాము | చిత్రప్రకారము |

## ఆరాధన క్రమము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 2 | పరిశుదాలయములో | పరిశుద్ధాలయములో |
| 12 | 12 | అర్చించుదును | అర్పించుదును |

## కీర్తనలు

| కీర్తన | చరణం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 7 | పల్లవి | 4 | వాసాలి | వాసాళి |
| 10 | 3 | 2 | అరయుమిలను | అరయగోరి |
| 11 | పల్లవి | 2 | ప్రోవవే | పోవువే |
| 13 | | 1 | అంధకారమణగె | అంధకారమణఁగె |
| ,, | | 3 | మంటికన్నిటికి | మంటికన్నింటికి |

| కీర్తన | చరణం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ,, | 6 | 2 | నేడు | వేడు |
| 17 | పల్లవి | 2 | నినె | నిన్నె |
| ,, | ,, | 4 | తనసుతుని | తనప్రియసుతుని |
| 18 | 5 | 3 | వాక్యనంద | వాక్యానంద |
| 19 | 13 | 3 | మొరలెట్ట | మొరబెట్ట |
| 23 | 3 | 3 | ఫలమునంత | ఫలమనంత |
| 26 | 6 | 1 | నాడెండము | నాడెందము |
| 29 | 2 | 1 | నట్టి | నట్టు |
| 30 | 2 | 3 | మివ్వంగ | మియ్యంగ |
| 34 | 9 | 1 | దోరి | దోలి |
| ,, | 32 | 2 | యెంతో | ఎంతో |
| 36 | 3 | 2 | గాల్చి | గార్చి |
| 37 | పల్లవి | 3 | తలి | తల్లి |
| 38 | ,, | 1 | శ్రీయేసునన్ను | శ్రీయేసునిన్ను |
| 39 | 9 | 2 | యదుట | యెదుట |
| ,, | 11 | 1 | ఆది | అది |
| 40 | 12 | 1 | విడి | విడిచి |
| 41 | 19 | 2 | జూచీ | జూచి |
| 44 | 1 | 1 | ఇప్పొదు | ఇప్పుడు |

| కీర్తన | చరణం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ,, | 1 | 2 | ప్రేమార్ధంబపు | ప్రేమార్థంపు |
| ,, | 5 | 1 | వైదుగ | వైదుకు |
| 49 | 8 | 1 | సహాయంబివ్వ | సహాయంబి య్యవ |
| 50 | 6 | 3 | కుమన | మనకు |
| 53 | 6 | 3 | మెలగు | మేలగు |
| 55 | పల్లవి | 3 | మగుటమగు | మకుటమగు |
| ,, | 2 | 2 | నొనర్చును | నొనర్చను |
| ,, | 5 | 3 | నత్తుయుండ | మత్తుయుండ |
| 57 | పల్లవి | 3 | కీవులను | టీవులను |

ప్రభు భోజనసంస్కారమును పుచ్చుకొనువారి కొ రకు ప్రశ్నోత్తరములు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 22 | 5 | ఏర్పచబడెను | ఏర్పర్చబడెను |

## కుటుంబ ప్రేమనుగురించి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 146 | 12 | గనుగ | గనుక |

## స్త్రీవిధేయతనుగురించి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 150 | 7 | ఓక | ఒక |

## మొదటి సంవత్సరపు నెలవాక్యములు.

### జనువరి.

యెహోవాను నమ్మి మేలుచేయుము; దేశమందు నివసించి, సత్యమునను సరించుము. కీర్తన 37: 3వ.

### ఫెబ్రువరి.

ఆయన మొదట మనలను ప్రేమించెను గనుక మనము ఆయనను ప్రేమించుచున్నాము. 1 యోహాను 4వ: 19వ.

### మార్చి.

యెహోవాను నమ్మినవాడును, ఆయనను నిరీక్షించినవాడును భాగ్యవంతుడు. ఇర్మీయా 17వ: 7 వ.

### ఏప్రిల్.

కన్నీళ్లతో విత్తువారు, సంతోషగానముతో పంటకోసెదరు. కీర్తన 126: 6వ.

మే.

ప్రయాసపడి భారమును మోసుకొను వారలారా! మీరందరు నాయొద్దకురండి. నేనుమీకు విశ్రాంతికలుగ చేతును. మత్తై 11వ: 28వ.

జూన్.

లోకములోమీకుశ్రమకలుగును; అయిననేమి, ధైర్యము తెచ్చుకొనుడి; నేనులోకమునుజయించియున్నానను. యోహాను 16వ: 33వ.

జులై.

దేవునిఆత్మచేత యెందరు నడిపించబడుదురో, వారేదేవునికుమారులైయుందురు. రోమ 8వ: 14వ.

ఆగుస్టు.

ఎవడైనను క్రీస్తుయందుఉండినయెడల నూతనసృష్టియైయుండును. పాతవిగతించెను; ఇదిగో! సమస్తమైనవిక్రొత్తవాయెను. 2కొరింథి 5వ: 17వ.

సెప్టెంబరు.

అంతటఒక మేఘమువచ్చి వారిని కమ్మెను;అప్పుడు ఈయననాప్రియకుమారుడు; ఈయనమాటవినుడని ఒకశబ్దము ఆ మేఘములోనుంచిపుట్టెను మార్కు 9వ: 7వ.

అక్టోబరు.

ఎల్లప్పుడును ప్రభువుయందు సంతోషించుడి; మల్లి చెప్పుదును, సంతోషించుడి. ఫిలిప్పి 4వ: 4వ.

నొవెంబరు.

కీడునుండితొలగి, మేలుచేయవలెను. సమాధానము వెతకి దాని వెంబడించవలెను. 1 పేతురు 3వ: 11వ.

దిసెంబరు.

ఇదిగో! త్వరగావచ్చుచున్నాను; ప్రతివానికిని వానివాని క్రియలచొప్పున ఫలమిచ్చుటకు నాజీతము నాయొద్దఉన్నది. ప్రకటన 22వ: 12వ.

రెండవ సంవత్సరపు నెలవాక్యములు.

జనువరి.

మీరు మొదట దేవుని రాజ్యమును ఆయననీతినిని వెతుకుడి. మత్తై 6వ: 33వ.

ఫెబ్రువరి.

నరుని మార్గములు యెహోవా కన్నులయెదుటనుండును. వానినడతలన్నిటిని ఆయన విచారించును. సామితెలు 5వ: 21వ.

## మార్చి.

ఆయనయందు నిలిచియున్నానని చెప్పువాడు, ఆయన ఏలాగు నడుచుకొనెనో ఆలాగే తానును నడుచుకొనవలెను. 1 యోహాను 2వ: 6వ.

## ఏప్రిల్.

వెలుగులో ఉన్నానని చెప్పుచు తన సహోదరుని ద్వేషించువాడు ఇదివరకు చీకటిలోనున్నాడు. తన సహోదరుని ప్రేమించువాడు వెలుగులో నిలుచుచున్నాడు. 1 యోహాను 2వ: 9వ.

## మే.

ఆయన మిమ్మును గూర్చి చింత్యము చేయుచున్నాడు గనుక; మీ చింతయావత్తు ఆయనమీద వేయుడి. 1 పేతురు 5వ: 7వ.

## జూన్.

దేవుడు ప్రేమయై యున్నాడు. ప్రేమయందు ఉండువాడు దేవునియందు, దేవుడు వానియందు ఉన్నారు. 1 యోహాను 4వ: 16వ.

## జులై.

దేవుడుమనయందుంచినప్రేమ దీనివల్లకనబడెను; మనము ఆయనద్వారాజీవించునట్లు దేవుడుతనజనైకుడైన తనకుమారుని లోకములోకి పంపెను. 1యోహాను 4వ: 9, 10వ.

## ఆగుష్టు.

ఈయనరక్తమువల్లమనకువిమోచనము; అనగా అపరాధముల క్షమముకలుగుచున్నది. ఎఫెసి. వ: 7వ.

## సెప్టెంబరు.

మనపాపములనుఒప్పుకొనునెడల ఆయనమన పాపములనుక్షమించునట్లును, సమస్తదుర్నీతినుండి మనలను పవిత్రులచేయునట్లును, నీతిమంతుడునుగను నమ్మదగినవాడునైయున్నాడు. 1యోహాను 1వ: 9వ.

## అక్టోబరు.

దేవునికిలోబడియుండుడి; సైతానును యెదిరించుడి; అదినీయొద్దనుంచిపారిపోవును. యాకోబు 4వ: 7వ.

నొవెంబరు.

మీపాపములుతుడిచివేయబడునిమిత్తముమీన స్సుతిప్పుకొనితిరుగుడి. అపొస్తలులకార్యములు 3ప 20వ.

దిసెంబరు.

మీరుసిద్ధముగానుండుడి;మీరుతలంచనిగడి యలో మనుష్యకుమారుడువచ్చునని చెప్పెను.లూ కా 12ప:40వ.

మూడవ సంవత్సరపు నెలవాక్యములు.

జనువరి.

నాపిల్లలారా! మాటతోనైనను నాలుకతోనైన ను కాదు గాని క్రియతోను సత్యముతోను ప్రేమింత ము. 1 యోహాను 3ప: 18వ.

ఫెబ్రువరి.

తండ్రినాకిచ్చుప్రతివాడును నాయొద్దకువచ్చును. నాయొద్దకువచ్చువాని నేనుయెంతమాత్రమును బ యిటికితోసివేయను. యోహాను 6ప: 37వ.

## మార్చి.

యేసు నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను. నాయందు విశ్వాసముంచువాడు చనిపోయినను బ్రతుకును. యోహాను 11అ: 25వ.

## ఏప్రిల్.

ప్రభువా! ప్రభువా! అని నాతో పలుకు ప్రతివాడును కాడుగాని, ఆకాశమందున్న నాతండ్రి చిత్తప్రకారము చేయువాడే ఆకాశరాజ్యములో ప్రవేశించును మత్తై 7అ: 21వ.

## మే.

క్రీస్తుయేసు యందుండువారికి యేశిక్షావిధి లేదు. రోమా 8అ: 1వ.

## జూన్.

నాయాజ్ఞయేదనగా, నేను మిమ్మును ప్రేమించిన ప్రకారము మీరు ఒకనినొకడు ప్రేమించవలెననే దే. యోహాను 15అ: 12వ.

## జులై.

మీరు శోధనలోకి రాకుండా, మెళుకువపడి ప్రార్థించుడి. మత్తై 26అ: 41వ.

### ఆగుస్టు.

మీరు క్రీస్తునామమున నిందించబడితే మీరు భాగ్యవంతులు. యెందుకనగా, మహిమగలఆత్మ అనగా దేవునిఆత్మమీమీద నివసించుచున్నది. ఆయన వారివల్లదూషించబడును, మీవల్ల మహిమపరచబడును. 1 పేతురు 4అ: 14వ.

### సెప్టెంబరు.

యేసు దేవునికుమారుడని,యెవడు ఒప్పుకొనునో దేవుడు వానియందును వాడు దేవునియందును నున్నారు. 1 యోహాను 4అ: 15వ.

### అక్టోబరు.

మనము మన మొదటిదృఢనిరీక్షణ తుదముట్టుకు స్థిరముగాకైకొనియున్నయెడలనే, క్రీస్తుతో పాలివారమైయుందుము. హెబ్రి. 3అ: 14వ.

### నొవెంబరు.

దరిద్రుని కటాక్షించువాడు భాగ్యవంతుడు; ఆపత్కాలమందు యెహోవా అతని తప్పించును. కీర్తన 41అ: 1వ.

డిసెంబరు.

మనము విసుకక మేలుచేయుచుందము. మనము అలసటపడకుండిన తగినసమయమందు పంటకోయుదుము. గలతియ 6వ: 9వ.

నాలవ సంవత్సరపు నెలవాక్యములు.

జనువరి.

సమస్తమునుపరీక్షించి యుక్తమైనదాన్ని పట్టుకొనుడి. 1 థెస్సలోనికై 5వ: 21వ.

ఫెబ్రువరి.

నీతిమంతుడు తనమార్గమును గట్టిగాపట్టును. యోబు 17వ: 9వ.

మార్చి.

ప్రభువుదృష్టికి దీనులైయుండుడి. అప్పుడు ఆయన మిమ్మును హెచ్చించును. యాకోబు 4వ: 10వ.

ఏప్రిల్.

ఒకనిభారములను ఒకడు మోసికొని ఈలాగుక్రీస్తుయొక్క ఆజ్ఞను బాగా నెరవేర్చుడి. గలతియ 6వ: 2వ.

## మే.

శక్యమైనయెడల సమస్తమనుష్యులతో మీవల్లనైనంతమట్టుకుసమాధానముగాఉండుడి.రోమ12ప: 18వ.

## జూన్.

కీడువల్లజయించబడక మేలువల్లకీడుజయించుము. రోమ 12ప: 21వ.

## జులై.

మిమ్మునుశపించువారిని దీవించుడి, మిమ్మునుసింధించువారికొరకుప్రార్థించుడి. లూకా 6ప: 28వ.

## ఆగుస్టు.

మద్యముతో మత్తుగా ఉండకుడి; అందులో దుర్వ్యాపారముకలదు. ఎపెసి 5ప: 18వ.

## సెప్టెంబరు.

సువార్తవల్లజీవించుటకు సువార్తప్రకటించువారికిప్రభువునియమించియున్నాడు.I కోరింథి. 9ప: 14వ.

## అక్టోబరు.

పగదాచుకొనువాడు అబద్ధికుడు, కొండెముప్రచురముచేయువాడు మూర్ఖుడు. సామెతలు 10ప: 18వ.

## నొవెంబరు.

యెహొవా నాపాలకుడు, నాకు లేమికలుగదు. కీర్త్తన. 23వ: 1వ.

## డిసెంబరు.

మనకు జీవమైయున్న క్రీస్తు కనపరచబడినప్పుడు మీరును ఆయనతోమహిమయందు కనపరచబడుదురు. కొలస్సె. 3వ: 4వ.

## ఆరాధనక్రమము.

పితృ, పుత్ర, శుద్ధాత్మనామమున. ఆమేన్.

యెహోవా తనపరిశుద్ధాలయములో నున్నాడు. ఆయనసన్నిధియున సర్వలోకము మౌనముగా నుండుగాక.

సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమాన పర్యంతము నా నామము అన్యజనాంగములలో ఘనముగానుండును. సకలస్థలములయందు, ధూపమును శుభ్రమైనయాగములును అర్పించబడును. ఏమనగ అన్యజనాంగములలో నా నామము ఘనముగానుండునని సైన్యముల యెహోవా చెప్పుచున్నాడు.

ప్రభువా! నా పెదవులను తెరువుము. అప్పుడు నానోరు నీస్తుతిని ప్రచురము చేయును. నీవు యాగమిచ్ఛయించుట లేదు. ఇచ్ఛయించిన అర్పించుదును. హోమముమునీకిష్టముగాదు. దేవునియాగము విరిగినయాత్మయే. దేవా! విరిగినలిగినహృదయమును నీవు అలక్ష్యము చేయవు.

యెహోవా! నాశిలా! నాయుద్ధారకుడా! నా నోటిమాటలు, నాహృదయధ్యానమును నీదృష్టికంగీకారముగానుండుగాక.

## దైవస్తుతి.

రా. ఫిమాద్. తా. ఛాప్.

తండ్రికిని కుమారునకు శుద్ధాత్మునకు మహిమా దియుండునటులిపుడెపుడు యుగయుగ ముండు నుగాక. ఆమేనా మేఁ ఆమేఁ ఆమేనా మేఁ.

## పాపములొప్పుకొనుట.

మిక్కిలిప్రియమైన సహోదరులారా! మనమనా నాపాపములను, దుర్మార్గములను ఒప్పి చెప్పుకొనవ లసినదనియు, మన ఆకాశపుతండ్రియైన సర్వశక్తిగ లదేవునిదయాదాక్షిణ్యములవలన క్షమాపణదొరు కునట్లు ఆయనసముఖమందు మనపాపములను మిష బెట్టిదాచక వినయము,దీనత్వము,పశ్చాత్తాపము, వి ధేయతయుగల మనస్సుతో మనముచెప్పుకొనవలసిన దనియు పరిశుద్ధలేఖనములు మనలను ప్రేరేపించు చున్నవి.

## ప్రార్థించుదము.

సర్వశక్తియు మిక్కిలికనికరమునుగల తండ్రీ! త ప్పిపోయినగొఱ్ఱెలవలె మేమునీమార్గములు తప్పితిరి గినాము. మామనస్సులఆలోచనలును, ఆశలును మి

క్కిలిఅనుసరించినడుచుకొన్నాము.నీపరిశుద్ధమైన ఆ
జ్ఞలనుమీరినాము. మేముచేయవలసినవిచేయక చే
యరానివిచేసినాము. మాలో క్షేమమేమియు లే
దు. అయిననుమాప్రభువైనక్రీస్తు యేసుద్వారా నీవు
మనుష్యులకు తెలియచేసిన వాగ్దత్తములప్రకారము,ఓ
ప్రభువా!పాపపీడితులమైనమమ్మునుకరుణించుము.ఓ
దేవా!తమతప్పితములు ఒప్పుకొనువారిని కాయుము.
పశ్చాత్తాపులనుతిరిగిచేర్చుకొనుము. మరియుమిక్కి
లికనికరముగలతండ్రీ! నీపరిశుద్ధనామమునకు మహి
మకలుగులాగున మేమికభక్తి,నీతి,సుబుద్ధులతో జీవిం
చునట్టు ఆయననిమిత్తము దయచేయుము. ఆమేన్.

గురువు. ఓప్రభువా! మా పెదవులు తెరువుము.
ఉత్తరము. అప్పుడుమానోరునీస్తుతిని బైలుపరుచును.
గురువు. ఓ దేవా!శీఘ్రముగామమ్మునురక్షించుము.
ఉత్తరము. ఓప్రభువా! మాకు సహాయముచేయుట
కుత్వరపడుము.
గురువు. తండ్రికి కుమారునికి పరిశుద్ధాత్మకును మ
హిమకలుగునుగాక.
ఉత్తరము. ఆదియందు యిప్పుడు ఎల్లప్పుడును యు
గయుగములయందును ఉండునట్టుగానే.
ఆమేన్.

గురువు. ప్రభువును స్తుతించుడీ.

ఉత్తరము. ప్రభువునామము స్తుతించబడునుగాక.

## విశ్వాసప్రమాణము.

పరలోకభూలోకములకు సృష్టికర్తయగు సర్వశక్తిగలతండ్రియైన దేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన ఏకకుమారుడు మన ప్రభువునైన యేసుక్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మవల్ల కన్యయైన మరియాంగర్భమందు ధరింపబడి ఆమెకు పుట్టెను. పొంతిపిలాతు కాలమందు బాధనుపొంది శిలువ వేయబడి, చనిపోయి, పాతిపెట్టబడి, అదృశ్యలోకములోనికి దిగెను. మూడవనాడు చనిపోయినవారిలోనుండి తిరిగి లేచి ఆకాశమున కెక్కి సర్వశక్తిగలతండ్రియైన దేవునికుడిచేతివైపున కూర్చుండిఉన్నాడు. అక్కడనుండి బ్రతికిఉండువారిని చనిపోయినవారిని విమర్శించుటకువచ్చును.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధక్రైస్తవ సభను, పరిశుద్ధులతో కూడియుండుటను, పాపక్షమాపణను, తిరిగి ప్రాణముతో లేచుటను నిత్యజీవమును నమ్ముచున్నాను. ఆమేన్.

## కీర్తన.

### జగత్ప్రభువర్ణన.

రా. ఆనందభైరవి. తా. జంపె.

మహిమసర్వోన్నత- మైనదైవమున కి-మ్మహిమస
మాధానాను-గ్రహముగల్గుఁ బ్రభో॥

1 నిన్నుస్తోత్రించుచు-నిన్ను బూజించుచు-నిన్ను మ
హిమపర్చుచున్నాము లోకప్రభో॥మ॥

2 ప్రభువైన దేవుండా- పరమండలపు రాజా- ప్రభ
లంబుగలతండ్రి- పరిశుద్ధంబగు ప్రభో॥మ॥

3 వినయంబుతోనీమ-ఘనమహిమార్థంబై వం-దన
ములర్పి-వినుతింతుము సత్ప్రభో॥మ॥

4 జనితైకపుత్రుడగు-ఘనక్రీస్తుప్రభు దే-వునిగొ
ర్రెపిల్లజన-కునికుమారుడప్రభో॥మ॥

5 ధరపాపముల మోయు-వరపుణ్యశాలుండా- కరు
ణించి మాబీద- మొరలాలించుము ప్రభో॥మ॥

6 తండ్రియైన దేవుని- దక్షిణభాగమున గూర్చుండి
యున్నావు కృప-జూపుము సత్ప్రభో॥మ॥

7 పరిశుద్ధుడవునీవే- పరమప్రభుడవునీవే- మరితా
త్ములంగావ- మరణంబైతివి ప్రభో॥మ॥

8 పరమజనకుని మహిమగ- పరిశుద్ధాత్మైక్యంబై-
పరణిమాకై యున్న సర్వోన్నతప్రభో॥మ॥

## ఆరాధన క్రమము.

1 వేదవాక్యము చదువుట.
2 కీర్తన పాడుట.
3 ప్రార్థన చేయుట.
4 కీర్తన పాడుట.
5 చందా కూర్చుట.
6 ప్రసంగించుట.

## ప్రభువు నేర్పిన ప్రార్థన.

ఆకాశమందున్న మాతండ్రీ! నీ పేరు పరిశుద్ధపరచబడును గాక. నీరాజ్యము వచ్చును గాక. నీ చిత్తము ఆకాశమందు ఏలాగో ఆలాగే భూమియందున్ను నెరవేరును గాక. మా దినాహారము నేడు దయచేయుము. మాయెడల తప్పితములు చేయువారిని మేము క్షమించునట్లు మా తప్పితములు క్షమించుము. శోధనలోనికి మమ్మును రానియ్యక కీడులోనుండి తప్పించుము. రాజ్యమును శక్తియు మహిమయు నిరంతరము నీవియైయున్నవి. ఆమేన్.

కీర్తన పాడుట.

దీవెన పాడుట లేక చెప్పుట.

ఆజ్ఞాప్రమాణము.

1 నేను నీ దేవుడను గనుక వేరే దేవతలకు మ్రొక్కకూడదు.

2 విగ్రహారాధన చేయకూడదు.

3 దేవుని పేరు వ్యర్థముగా పలుకకూడదు.

4 ఆదివారమున పని చేయకుండా దేవుని గురించి ధ్యానించవలయును.

5 నీ తల్లిదండ్రులను సన్మానించవలయును.

6 నీవు నరహత్య చేయకూడదు.

7 నీవు వ్యభిచారము చేయకూడదు.

8 నీవు దొంగతనము చేయకూడదు.

9 నీవు అబద్ధసాక్ష్యము చెప్పకూడదు.

10 నీవు నీ పొరుగువానిది యేదియైనా సరే ఆశించకూడదు.

---

## ప్రొద్దుటి ప్రార్థన.

ఓ ప్రభువా! యేసుక్రీస్తు నిమిత్తమై నేడు నన్ను దీవించి కాపాడి, యావత్తు పాపమునుండి నన్ను రక్షించుమని వేడుకొనుచున్నాను. ఆమేన్.

## మాపటి ప్రార్థన.

ఓ ప్రభువా! యేసుక్రీస్తునిమిత్తమై నేటిరాత్రి నన్నుచూచి నాపాపములన్నిటిని క్షమించి నన్ను మంచిపిల్లనుగా చేయుమని వేడుకొనుచున్నాను. ఆమేన్.

## భోజన ప్రార్థన.

ఓ నాతండ్రియైన దేవుడా! నీదయవల్ల నాకిచ్చిన ఆహారమునుదీవించి, నన్ను కాపాడుటకై యేసుక్రీస్తు పేరట నిన్ను వేడుకొనుచున్నాను. ఆమేన్.

## బప్తిస్మమునుపొందేవారికొరకు ప్రశ్నోత్తరములు.

1 ప్ర. క్రీస్తుసువార్త ఎవరికొరకైనది?

ఉ. క్రీస్తుసువార్త మనుష్యులందరికొరకైనది.

2 ప్ర. క్రీస్తు తనసువార్తను తెలియజేయుటకై ఇచ్చినఆజ్ఞఎట్టిది?

ఉ. సమస్తమైనవారికి బోధించి బప్తిస్మమునిచ్చి శిష్యులనుగా చేయుడనేదై యున్నది.

3 ప్ర. సువార్త నమ్మనివారినిగురించి క్రీస్తు ఏమిచెప్పెను?

ఉ. నమ్మనివారికి శిక్షవిధించబడునని చెప్పెను.

4 ప్ర. ఎందుకు క్రీస్తుమతమును కోరుచున్నావు?

ఉ. ఆత్మరక్షణ్యమునుపొందుటకుకోరుచున్నాను.

5 ప్ర. ఎందుకుబప్తిస్మమును పొందకోరుచున్నావు?

ఉ. క్రీస్తు ఆజ్ఞయై యున్నందున కోరుచున్నాను.

6 ప్ర. ఆయాజ్ఞయెట్టిదో వివరించుము?

ఉ. నమ్మిబప్తిస్మమునుపొందువాడు రక్షించబడునని చెప్పెను.

7 ప్ర. ఎటువంటిమనస్సుతో బప్తిస్మమునుపొందవలెను?

ఉ. బప్తిస్మము మహాగొప్పదిగనుక వినయముతోను భక్తితోను పొందవలెను.

8 ప్ర. ఈబప్తిస్మమును ఎవరియెదుటపొందినట్టు తలంచవలెను?

ఉ. మనస్సులోనుండే మర్మము నెరిగిన

నిజదేవునియెదుట పొందినట్లు తలంచ
వలెను.

9 ప్ర. ఆలాగుపొందనియెడల ప్రయోజనమే
మిటి?

ఉ. ఏప్రయోజనము లేకపోవుటయేగాక దే
వునికి మిక్కిలి అసహ్యమైనదై యుం
డును.

10 ప్ర బప్తిస్మమునుపొందినవా రెట్టిమార్పుగల
వారై యుండవలెను?

ఉ. మనస్సుయందు, మాటయందు, నడత
యందు క్రొత్తవారై యుండవలెను.

11 ప్ర. ఎవరిసహాయమువల్ల ఇట్లునడుచుకొ
నగలవు?

ఉ. దేవునిసహాయమువల్ల నడుచుకొనగ
లను.

12 ప్ర. దేవునిసహాయమెట్లుదొరుకును?

ఉ. నిండుమనస్సుతో ప్రార్థించుటవల్ల
దొరుకును.

## ప్రభుభోజనసంస్కారమును పుచ్చుకొనువారికొరకు ప్రశ్నోత్తరములు.

1 ప్ర. ప్రభుభోజనమను పరిశుద్ధసంస్కారము ఎవరివల్ల ఏర్పరచబడెను?

ఉ. మనరక్షకుడైన యేసుక్రీస్తువల్ల ఏర్పరచబడెను.

2 ప్ర ఎప్పుడు ఏర్పచబడెను?

ఉ. క్రీస్తుమరణముపొందకమునపటిరాత్రి ఏర్పరచబడెను.

3 ప్ర. ఎందుకుఏర్పరచబడెను?

ఉ. మనకొరకు క్రీస్తుపొందినశ్రమను,మరణమును జ్ఞాపకము చేసుకొనుటకు ఏర్పరచబడెను.

4 ప్ర ఎటువంటిమనస్సుతో ఈపరిశుద్ధసంస్కారమును పుచ్చుకొనవలెను?

ఉ. అందరితో సమాధానముగానుండి, పాపములకొరకువిచారపడి, క్రీస్తుమనకొరకుపొందినశ్రమ, మరణాములను తలంచేమనస్సుతో పుచ్చుకొనవలెను.

5 ప్ర. తగినట్టు పుచ్చుకొనువారి కెట్టిమేలు
కలుగును?

ఉ. ఆత్మసంబంధమైన గొప్ప మేలు కలుగు
ను.

6 ప్ర. తగనట్టు పుచ్చుకొనువారిని గురించి
యేమి వ్రాయబడియున్నది?

ఉ. అట్లాపుచ్చుకొనువారు క్రీస్తుశరీర ర
క్తములనుగురించి యపరాధు లౌదుర
ని వ్రాయబడియున్నది.

7 ప్ర. గనుక మన మేమి చేయవలెను?

ఉ. మనలను మనముపరీక్షించుకొని తగిన
టువంటి మనస్సుతో ఆభోజనము పు
చ్చుకొనవలెను.

# HYMNS.

## కీర్తనలు.

### దైవస్తుతి.

1. రా॥ కాంభోజి. తా॥ జంపె॥

ఘనబలమహత్వంబు-లెన లేని సౌందర్య-మెవనిముం దటనున్న వో- సోదరులార- అనుదినంబెవనివ- ర్తన మద్భుతంబుగ- జనులుదీర్చుచున్న వో (అ)= ఘను డెహోవాయని- వినయపూర్వకముగా- వినుతిజే యుడి సేయుడి॥ ఘన॥

1 పరమండలమువసుం-ధరమండలము లె-వని పల్కు-చే జేయబడెనో- పరివృతంబగు నెల్ల-ప్రాణు లె వ్వనివలన- బ్రతికింపబడుచున్న వో- పరిపరివిధంబుల గు- భాషలెవ్వనిసుప్ర- భావంబుగొనియాడునో (అ)= పరమధాముడెహోవ- పరిపూర్ణశక్తుడని- ప్రస్తుతించరె వేడ్క-తో॥ఘన॥

2 ఉన్నలోకములలో-నున్న వృత్తాంతంబు-ల న్నియెవనికి దెలుసునో- అన్నింటిలోనొక్క-చిన్న

బిగురువబడక- నున్న దెవ్వరిచేతనో- యెన్నటికి దలి
యబడ- కున్న మదిమార్గపు- చిన్నె లెవనికి దెలుసునో
(అ)=యున్న తజ్ఞానసం-పన్న డైహోవాయని- స
న్నుతించరే నిత్యము॥ఘన॥.

3 పరిశుద్ధపరిశుద్ధ- పరిశుద్ధుడనిపిల్వ- బడిననా
మం బెవరిదో- నరులరక్షణకొరకు- వరసుతుని బంపుట
చే- వర్ణనాపే రెవరిదో- నెరనమ్ము వారలకు- బరమియ్య
నెవరిచే- బ్రచురింపబడుచున్నదో (అ)=వరరక్షకుడై
హోవ- కరుణాలవాలుడని- పరిపూర్ణస్తుతిజేయరే
॥ఘన॥

---

## సృష్టికర్త కృతజ్ఞత స్తుతి.

2. ౨.

రా. కాంబోది. తా. అట.

అన్ని కాలంబుల- నున్న యో హోవా నీ- న్నెన్న
తరంబటే- కన్న తండ్రీ=వన్నె కెక్కి- న మోక్ష వాసాళి
సన్నుతు- లున్నతమై యుండవమ న్నెనీకు॥ అన్ని॥

1 నిన్ను బ్రకటనజేయ- నిఖిలలోకములను పన్నుగ
జేసినబలుడవీవె= ఉన్న లోకంబుల నుడుగక కరుణా
సం- పన్నతతో నేలు బ్రభుడవీవె- అన్ని జీవుల నెరిగ-

యాహారమిచ్చుచు నున్న సర్వజ్ఞుండవునీవే= ఎన్న శక్యముగాక- నున్న లక్షణముల-సన్నుతించుటకునే జాలుదునా॥ అన్ని॥

2 పుట్టించనీవంచు-పోషించనీవంచు- గిట్టించనీ వంచుకీర్తింతును= వట్టిపనికిమాలి-నట్టిమానవులచే-పట్టి రక్షించబాధ్యుండవంచు- దట్టమైనకృపనుదరి జేర్చ నాకిచ్చి- పట్టైనిలచియుండు ప్రభుడవంచు= కట్టడచ్చే కడముట్టుడనుకనా- పట్టుకొలదినినిన్ను- ప్రస్తుతింతుగా॥అన్ని॥

3 కారుణ్యనిధినీవు- కారిస్యుడను నేను- పరిశుద్ధుడవునీవు పాపి నేను= భూరిభాగ్యుడవీవు-భువిలోననాకన్న- దారిద్రుడే లేడు - తరచిచూడ - సారసద్గుణముల- సంపన్నుడవునీవు- ఘోరదుర్గుణసం-చారి నేను= ఏరీతిస్తుతియింతు-నేరీతిసేవింతు-నేరమెన్నక బ్రోవ-నెరనమ్మితి॥అన్ని॥

---

## క్రీస్తు- అవతార స్తుతి.

3.

రా. సెహాన. తా. ఆది.

నారక్షకాయేసు- నాధాయిమ్మానుయేలు= ఘో

రపాపులపాప- భారవిమోచక॥నారక్షకా॥

1 నిత్యకాలమునందు- నిజమైన దేవుని= సత్య
వాక్యమైయున్న- స్వామిని స్తుతియింతు॥నారక్షకా॥

2 సర్వలోకంబులను- సత్యవాక్యమైయుండి=
నిర్వహించిన దేవు- నిజబాహువా స్తుతింతు॥ నారక్ష
కా॥

3 దీనజనులకును వార్త- దెలుపనభిషేకంబు=
ప్రాణినొందిన దేవ- పుత్రుండనుతియింతు॥నారక్షకా॥

4 దేవమహిమ ప్రకాశ- దీన రక్షకమాను=
ష్యావతారముదాల్చి- యాపదాజ్ఞలదీర్చిన॥ నారక్ష
కా॥

5 పావనాత్ముతుడవై- పరమజ్ఞానము దెల్పిన=
దేవస్వభావముద్ర- దేదీప్యుడా స్తుతింతు॥నారక్షకా॥

6 పాపాత్ములనుగావ- శాపభారముక్రింద=
నోపికతోనిల్చి- ప్రాపుజూపినప్రభువా॥నారక్షకా॥

7 ఈవసుధను ప్రేమ- నెసగునట్లుగజూపి=చా
వుగెల్చినసర్వసామర్థ్యుడా స్తుతింతు॥ నారక్షకా॥

8 ఘనదేవుకుడిపార్శ్వ- మునగూర్చుండివిజ్ఞ
ప్తి= నొనరించునాయేసు-వినయస్తోత్రంబిదిగో॥నా
రక్షకా॥

---

## పరిశుద్ధాత్మస్తుతి.

4. ర.

రా. బిళహరి. తా. అట.

పరిశుద్ధాత్మమహాత్మ- పరమపావురమా- మరి తే
చ్ఛలనుదూర- పరచైస్థా వరమా॥పరి॥

1 నిత్యంపు వెల్గుచే- నింపుజ్ఞానాత్మ= సత్యంపు
వార్త- సంధించుకృపాత్మ॥పరి॥

2 జీవమార్గంబున- జీవింపనేర్పి= త్రోవదప్పిన
వారి- భావంబుమార్పు॥పరి॥

3 పాపాంధకారంబు - బాపు నీ వెలుగు= జూ
పుమింటికినడిపి- కాపాడిమెలిగె॥పరి॥

4 భక్తుండుశోధించ- బడుచుండునేని= యుక్తి
దెల్పెడిసర్వ-శక్తినీదౌను॥పరి॥

5 తిన్ననైన తెలివి- తేటనాకిమ్ము= నిన్ను సేవిం
చెద- నిజముస్తోత్రమ్ము॥పరి॥

## త్రిత్వము స్తుతి.

5. ౫.

రా. బేగడ. తా. ఆది.

త్రిత్వమై- నిత్యత్వమున నే- కత్వమగు దేవా- (నీ)
సత్వసామ- ర్థ్యత్వములనిజ- తత్వముగాంచియమ-
రత్వముస్తోత్రించెదను॥ త్రి॥

1 ఎల్లలోకంబులుసృజించిన- చల్లనితండ్రి(నా)
యుల్లముననీగొప్పవింత- లెల్లసంతసిల్ల శోభిల్లదలంచె
దను॥ త్రి॥

2 వాసికెక్కినపరమరాజ్యని- వాసమునువిడి
న(శ్రీ)యేసునాథుండను కుమారా- దోసులదోసంబు
లెల్లగాసిరక్షించినావు॥ త్రి॥

3 ఆదరణకారుండవగుప- రాత్ముడాతండ్రి(ఆ)
మోదనామమునంపబడియేసు- నాథునిసుబోధలెల్ల
బోధపరచిపాదుకొల్పు॥ త్రి॥

4 ఓపితాసుతాపరాత్మ- ఒక్క- దేవుడవు(ఎల్ల)
పాపులనురక్షించమిగులనో- పికతో నాపదలుబాపికృ
పజూపినావు॥ త్రి॥

---

## దైవాశీర్వాదమును కోరుట.

6. ౬.

రా. హుసేని. తా. చాపు.

దేవాయాశీర్వదించుము- దివ్యానంతప్ర-భావా
సుమ్మాదరింపుము= దేవానీయాలయంబున- సేవ
లంబుగనీదు- పావనవాక్యములను- భావింపజేరితి
మో॥ దేవా॥

1 రంగైననీనామము- రంజిల్లుగాక- శృంగార
యాలయమునందు= సంగీతరావములప్ర- సంగం
బులతోనీ- మంగళంబగునామ- మంగీకారమగునట్లు॥
దేవా॥

2 పరిశుద్ధవేదబోధకులు- విరళించబోవు- పర
మార్థంబైనబోధలు= గురితించివినడమునకై- పరివే
ష్టించితిమిమా- దురితంపుభావములను- బరిమార్చిచ
క్కబరచి॥ దేవా॥

3 గురినిల్పివినుటయేగాక- పరిశుద్ధవాక్య- పరిశీ
లనంబుజేయుచు= బరిపూర్ణవిశ్వాస- భరితాత్ముల
మైభువిని- నెరిశోధనములుగెలచి- చిరజీవమ్ముకిన్నొం
ద॥ దేవా॥

4 పరమార్థంబైనబోధలఁ- మరలసబ్బాతు-
పరకునిలువరముగానుండ= పరిశుద్ధాత్మునిసహాయ
ము- పరిపూర్ణముగనొసంగి- తిరమొప్పహృదయము
లుబల- కరముగనుండి సేవించ॥దేవా॥

5 ధరపైమరణాంతమువరకు- విరళించబడెడి
పరిశుద్ధవేదసారములఁ= మరగి మాయాత్మలెల్ల- బ
రిపూర్ణబలమునొంది- మరణాంతమునందునీదు- వర
మోక్షమహిమనొంద॥దేవా॥

---

## ఆలయార్పణము.

7. 2.

రా. కేదారగౌళ. తా. ఆది.

వందనమిదిగో యెహోవానందనా- భక్తచం
దనా- సర్వానందనా- వందనమిదిగోసుభక్త- బృంద
పరిపాలానిత్యా- నందదాయిమోక్ష వరమందిరవా
సాళివందిత॥వందన॥

1 సారకారుణ్యాభిధాన- నారకతారణాధీన
చారుసచ్చరిత్రగాన- కూరిమిభక్తాళిజ్ఞాన= భారవి
మోచనదీన- రక్షకా- మహిమాధ్యక్షకా- సుజనా

పేక్షకా- (దివ్య) కారుణ్య పారావారాబుధ- పక్ష
కా- కృతమోక్షకా- దురితశిక్షకా- (నిష్) కారణ
ప్రేమక్షేమాధి-కారసత్యమానుష్యావ-తారకలుష
వారసం- హారాకారసంస్తుతి॥వందన॥

2 ఆదినిధనాగాధప్రేమా- మోదజ్ఞానాది గు
ణభూమా- వేదతత్వజ్ఞాళిక్షేమా- పాదకపరమాత్మ
ధామా= వాదరహితానంతధర్మా- దేవనా- ఆత్మ
జీవనా- పతితపావనా- (సర్వ) శ్రీదాసర్వేశ జగదవ
నా- సత్యభావనా- కృత్యసేవనా- (సర్వ) భేదాభే
దశూన్యసం- మోదకలితాత్మనీన- వేదామృతసార
స్వాదువర్ణనసంస్తుతి॥వందన॥

3 నిరతమోక్షానందభరిత- కరుణించుమేసుధి
కదురిత- భరితాత్ములమై నెరినమ్మితిమి- పరిశుద్ధాత్మ
నొసగిపతిత= పావనమొనరించుభవ్య- స్తోత్రుడా
శుభచరిత్రుడా- సర్వపాత్రుడా-(లోక) నరులకై జీ
వమిచ్చినఘనమిత్రుడా- దేవపుత్రుడా- యూదాగో
త్రుడా- (మమ్ము) సురచిరంబైనట్టిపరమ-పురివేగిర
మునరుగదివ్య- కరుణాసహాయమురన్వంత-దరిజేర్చ
దయసేయుసంస్తుతి॥వందన॥

4 ఆకాశముసింహాసనంబు- లోకమేపాదపీ
ఠంబు- నీకైమేమొకాలయంబు- ఏకరణిగట్టతరం

బు=ప్రాకటంబై యొప్పుపరమ - త్రిత్వమై - నిత్యత్వ
మై - ఏకత్వమై (స్వర్గ) శ్రీకరాకారుండ పిత్రుత్వ
మై - వరపుత్రత్వమై - శుద్ధాత్మత్వమై(అదృ)శ్యాకా
రవంతుండనిన్ను - ఆకాశాకాశము లేపట్టు - లేకుండ
దహ స్తకృతంబౌ - స్తోకాలయమిదెట్లబట్టు॥వందన॥

6 పరత్రరోగాదులకుమందు - దారుణనరయాల
యమునందు - నరులారాయేసు నిపొందు - చిరకాలమా
రోగ్యమొందు= నిరతంబద్దిగోరువారి - డెందము - ని
త్యానందము - ధరనీచందము - (నొంద) గురుతరవిశ్వా
సముచే - కొందము - మోక్షానందము - గనుగొంద
ము - (రండు) కరుణాబ్ధిక్రీస్తుండుమనకు - వరదుండైఆల
యమునందు - చిరభక్తితన్నారాధించు - నరులసంర
క్షించుస్వామి॥వందన॥

7 నూతనాలయంబున - ప్రీతిచేప్రవేశించిన - పా
పసులమైనట్టిమమ్మున - నీతిఫలితాశీర్వాదమున= గా
స్తునసినప్రీతిమియేసు - నాయక - మోక్ష - దాయక - ప
రజేయక - (నీప్ర) తీతనామమునవేడ - రోయక - గురి
సేయక - నిన్నుబాయక - (సర్వ)దాతయౌనాయే మెమ్మా

నాపక్ష- పాతరహితమైనస-నాతనజనకుడనిమధుర
గీతినిలయచేబాడెదము॥వందన॥

---

8. ౮.

## క్రీస్తు జన్మదినోత్సవస్తవము.

రా. శుద్ధసావేరి. తా. అట.

యేసునాధుండుద్భవించె- నెల్ల- దాసజనముసం
తసించె- నాసక్తిగలవారి- యాత్మరక్షకుండై- వాసికె
క్కినమాతవార్తప్రకారంబు॥యేసు॥

1 ఆదియంతములేనివాడు-దైవాత్మచే జన్మిం
చినాడు- ఆదియంతముగాని- యాత్మైక్యమైయుండి
బీదలందరిగావ- నాదికుమారుండై॥యేసు॥

2 పాపమాదము జేసినాడు-దాని-బాపనిర్ణయు
మైనవాడు- ప్రాపుతానై మాత-రూపంబుచేమున్న
కాపుజేసినపర-మోపకారియైన॥యేసు॥

3 చాలకాలమునుండివింటిమి-యీ-మేలువార్త
జాడగంటిమి-మేలసందియముబే- డా లేమమునపశు
ల- శాలయందు(జిన్న)బాలుడైమరియమకు॥యేసు॥

4 మున్ను దూతలు దైవజనులు- చాటి- యున్నా
రి బాలపనులు - కన్నులపండువుగ - గాంచంగబడెను
లో-కన్ను లైరవిచూచి-సన్నుతించుచమిలను॥యేసు॥

5 గొల్లబోయలుచూచినారు- చూచి- యెల్ల
వారికిచాటినారు- కల్లగాదుసు వార్త - పల్లదీని నెరిగి
యుల్లంబులో నమ్మి-ముదితభాగ్యంబందు॥యేసు॥

6 ఆకాశమున దూతలప్పుడు-మహిమ- మార్గంబు
గాబాడిరిపుడు- ఏకంబుగామన- మెల్లస్వరముల నెత్తి-
యాకసమునకునాదమంటబాడుద మెపుడు॥ యేసు॥

7 సీమోను ప్రభువు నెత్తుకొనె- దైవ- నామం
బుస్తుతిగావించుకొనె- ప్రేమార్ధ హస్తమున- నామ
హాత్ముని జేర్చి- క్షేమాధిపతియంచు-సేవించుదమురం
డి॥యేసు॥

8 జ్ఞానులనబడువారె తెంచి- మ్రొక్కి- కాను
కల్ధూపములర్పించి-యానందభరితాత్ము-లైనారుమ
నమల్లు- ప్రాణిమానసూర్తి- పూజనర్పించుదము॥యే
సు॥

9 కోరికి ప్రభుని రాకడను- జనుల- కోరికితడని
పల్కబడెను-కోరిమెనరుచూచు- వారలీసమయము
న- సారెసారెకుగడలించి-సన్నుతించిరిమిగుల॥యేసు

10 పాపిమీాద ప్రేమయెంత- మనుజ- రూపంబు ధరియించెవింత- మాపు రేపు లేని- మహితస్వర్గముఁపీడి- శాపభారముదీర్చి- పాపాత్ములనుబ్రోవ ॥యేసు॥

---

9. ౯.

క్రీస్తునాదివాక్యమని కొనియాడుట.

రా. ఆనందభైరవి. తా. ఆది.

అలిలూయఅలిలూయా మెంగ్ - శ్రీయేసునాథున-కలిలూయఅలిలూయా మెంగ్ ॥అ॥

1 తొలిబలుకులవిధ- ములభక్తులకో- ర్కెలుదీర్పను నెలకొనియిల వెలసెను॥అ॥

2 తొలిబలుకైకలుముల-కలిమైసత్ఫలముల-నిడ వెలుగుల వెలుగయ్యెను॥అ॥

3 కలుషబంధకంబులపాలిటి గొడ్డలి-యనయేసు వొడలుధరియించెను॥అ॥

---

10. ౧౦.

## పాపిసంతోషస్తుతి.

రా. బిళహరి. తా. అట.

మంగళంబనిపాడరె (క్రీస్తునకుజయ) మంగళంబ
నిపాడరె (యేసునకుజయ) మంగళంబనిపాడరె=
మంగళంబనిపాడిసజ్జ-నాంగపూజితుడైకృపాత-రం
గిలోకసమూహపాపవి-భంగుడనియు-ప్పొంగిజయజ
య॥మంగ॥

1 ఘనయూదదేశంబులో (ననుబెత్లెహే)ము
నయూదాకులములో= వినుడుయోసే-ఫునకుసతి
యై-దనరుచుండెడిమరియకడుపున-జననమైయీమ
ర్త్యవరులకు- సద్గతినిగల్గించువానికి॥మంగ॥

2 సోదరాళిభంగిని (భక్తులనెల్ల) జూచిబ్రో
చెడువానిని= యూదదేశపువారలధిక-బాధబెట్టుచు
హింసజేసిన- సాదరంబునత్రిదినంబులకు- సాధులకు
కనుపడినప్రభునకు॥మంగ॥

3 ధరనిన్గాల్చెడిదాసజ (నములనుబ్రోచు) దై
వతనయుడనీనిజ= మరయమిలను స్మరించువారికి -గు
రుతరంబగుకలుషజలనిధి- దరికిజేర్చుచుపరమపదనే

ఇరువొందన ర్చ్చదననిన ప్రభునకు॥వుం౦౫॥

---

11. ౧౧.

## క్రీస్తు దేవుడని స్తుతించుట.

రా. ముఖారి. తా. త్రిపుట.

నీవునా దేవుండవైయున్నా వుయేసునాథయీవు
ల-ప్రోవవే-నన్ను-గావవే॥నీవు॥

1 పాపమానవ-శాపభారము-నోపిశిల్వనుబ
డినక్షేమా-ధిపతి-సర్వ-భూపతి॥నీవు॥

2 శ్రేయమా-కాయంబుభక్తుల-కీయసిద్ధము
జేయుయేసు-నాయకా-మోక్ష-దాయకా॥నీవు॥

3 జీవమారెడి-త్రోవనేబడి-చావనైయున్నా
నుపతిత-పావనా-ఆత్మ-జీవనా॥నీవు॥

4 ఇంటనొంటన నిన్నంటకష్టము-లంటదుఃఖస
ముద్రమునబడి-యుంటినీ-కృపగను-గొంటిని॥నీవు॥

5 జాగుసేయక-బాగుజేయను-రాగదె నేఘో
రపాప-రోగిని-దుఃఖ-భాగిని॥నీవు॥

6 పాపముననా-రూపుమాపిటి-ప్రాపునీవనిన
మ్మితినినను-లేపవా-కృపను-జూపవా॥నీవు॥

---

12. ౧౨.

## పరిశుద్ధాత్మ లేని సాధన వ్యర్థము.

రా. కళ్యాణి. తా. ఆట.

పరిశుద్ధాత్మను గోరుము(జీవమా యేసు) ప్రభుని పే
రట వేడుము= నరులందరి మీద-నా యాత్మనుంతు నని
పరలోక పుతండ్రి- పలికె వేదమునందు ॥ప॥

1 పరిశుద్ధాత్మము లేనిది (వేదాగమ) పఠన పఠన
ము గాదది= నెరి-చీకటింట- సరుకులు వెదుకు రీతి ప-ల్కు
ను వెదికినను ని-రర్థకమై పోవును వేగ ॥ప॥

2 పరిశుద్ధాత్మము లేనిది (వర్షము లేని) పైరు చం
దం బేయది= పరబోధకములు- పవిత్రమైన పనులు జీ-వ
ము లేనివై యనుభ-వము గానివై యుండు ॥ప॥

3 పరిశుద్ధాత్మము లేనిది (యేసు ప్రభుని) నెరుగ
నెరుగుట గాదది= నరరూపు దాల్చి న-ర్వరుల రక్షణ
కొరకు-మరణ మొందిన ప్రభుని- కరుణాధికము వడయ
॥ప॥

4 పరిశుద్ధాత్మము లేనిది (జీవము లేని) బ్రతుకే బ్ర
తుకు గాదది= మరి తేచ్ఛలను గొప్ప-యురులందగిలి భ
క్తి-తరిగిపోవుటకద్ది-దొరుక నందు నేనమ్ము ॥ప॥

5 పరిశుద్ధాత్మను పొందుట (యన్నిటికన్న) ప్రబ
లంబైన మేలిట = నెరనమ్మి మొఱపెట్టు - పరమపావను
డద్ది - కరుణించి నీకొసగు - మరణాంతమగుదనుక ॥ప॥

---

13. ౧౩.

## ప్రాతస్తవము.

రా. యమునాకళ్యాణి. తా. జుల్పా.

శ్రీయేసుకర్తను - సేవచేయుటకు మేల్కొను - శ్రీ
యేసుకర్తను.

1 శ్రేయముల నెఱింగి - నిను - రేయుఁబవలొసంగి
యెడ - బాయని యంతరంగి - య - పాయంబు ద్రోయ
సహాయంబుఁ జేయ ॥శ్రీయేసుకర్తను॥

2 నిమిరయందు నేడు - క్షేమ - మొదవఁగాఁచి
నాఁడు - సూర్యుఁ - డుదయమాయెఁ జూడు - నీ - హృదయ
మున సదమలపదవులుదయింప ॥శ్రీయేసుకర్తను॥

3 అంధకారమణఁగెన్ - హృద - యాంధకార
మణఁగెన్ - ప్రభునందు తెలివిగలుగెన్ - నిబంధనలు డెం
దమున కందముగ గూర్చి ॥శ్రీయేసుకర్తను॥

4 కంటిపాపవలెను-నన్ను-గాయువాని దయను-
కనుగొంటివిస్తారమును - జేయు - మింటికిని నంటికి
న్నంటికినికర్తయని॥ శ్రీయేసుకర్తను॥

5 కలకలధ్వనిఁజేయు- పక్షి - గములులయును
గాయు-స్వర-ములుప్రభుస్తుతిఁజేయు-నీ-వలయుకే
గాలయుకే - వెలయఁగన్నాఁడు॥ శ్రీయేసుకర్తను॥

6 సేవయుంచనీకు-మంచి-యీావులిడుపరాను-
గల-భావముబడఁబోకు-నేడు-కావవే-కావవే- కావ
వేయుంచు॥ శ్రీయేసుకర్తను॥

7 పగటివారకుంచు- ని- ష్ఫలపుక్రియలుప్రం
చు- యుగ- యుగములుజీవించు- పురి- కెగయనీదిగు
లువిడు- తగునన్యకమున॥ శ్రీయేసుకర్తను॥

8 మింటినంటబాడు- నీ- యొంటిబలిమి నేడు-
ప్రభు- నంటియుండవాడు- ని- న్నొంటి నెన్నంటి కె
న్నంటికిన్నిడడు॥ శ్రీయేసుకర్తను॥

---

14. ౧౪.

## ప్రార్థననిశ్చయము.

రా. నాదనామక్రియ. తా. ఆది.

1 నన్నుప్రార్థించుమను (యేసునిద్వారా) నన్నుప్రా

ర్థించుము= నమ్మినవారినిగావ ఎవాగ్దా- నమ్ము జేసె
నెకృపనిత్తునని॥నమ్మి॥

1 నమ్మిమేల్జేయును- (యెహోవాయందు)-
నమ్మిమేల్జేయుము= నమ్మిమేలుజేసితివానిక్- య
మ్ముగానీ వెప్పుడుజీవింతువు॥నమ్మి॥

2 నమ్మకమువీడకు(శోధనలుజూచి) నమ్మకము
వీడకు= నమ్మమువానిని గెలువను సహా- యమ్ముయె
హోవాయిచ్చు సత్యము॥నమ్మి॥

3 నమ్మిజీవించుము(యెహోవాయంద)నమ్మి
జీవించుము= నమ్మియెదురుచూచెడిభక్తులభా- గ్య
మ్మునిత్యసౌఖ్యమ్ముపరమున॥నమ్మి॥

---

15. ౧౫

## మనః ప్రేరేపణ.

రా. సౌరాష్ట్ర. తా. ఆది.

దేవాబ్రోవుమంచుప్రార్థింపవే మనసా- సేవయే
సుద్వారా గావింపవే మనసా॥

జీవమార్గమందునిలువలేవ- నిన్ను నిలుపుజుమ్ము-
పావనాత్మనొసగి శాశ్వ- తా వనంబునిచ్చునమ్ము॥ దే॥

1 ఆధారమైయున్న నీశుద్ధాత్మనీచుట్టువ్యాపిం
చి - వాదులాడిపిడకసత్య - బోధమార్గమంచ దించి
మీాదిరుచులంజూపినిన్ను - మిసిమిగాజేయుధ్యానిం
చి· ఖేదమొంపసాగసియున్నకిల్బిషంబులందలఁచి॥ దే॥

2 కారుణ్యభావంబుతోడ- గాచుచున్నవానివి
డిచి సారహీనమైనశా- రీరభోగములనుగుడిచిపూర
మైతివిప్పుడుది-క్కేరినీకన్నీరుదుడిచి- పారమార్థికం
బుజూపు-వారిదారిగోరినడిచి॥ దే॥

3 లోకభ్రమలగూడియాడ-చీకుపరచుకొనక
మంచి యాకారంబుగూర్పకప- రాకుచేకాలంబుముఁ
చిభీకరాగ్నిబడుదువవి- వేకవర్తనంబుఁ ద్రుంచి సాకుల
న్నమానిత్రి- యేకదేవుఁబ్రేమఁగాంచి॥ దే॥

4 పాప మాధికమైనచోట- ప్రభునికారుణ్యాధి
కంబు చూపబడినసాఁపుబాట-జూచిదుస్స్వాభావికం
బు నాపునినుమన్నించునని - రాశపడక నమ్మకంబు
మోపుగానీదేవునంపు-జూపుచున్నవేనిరతంబు॥ దే॥

5 పారిశుద్ధజీవనంబు-గోరినిత్యానందమొందు
పారనంతమైనపదవి- సాధించువిశ్వాసమంచు నీరసం
బుబడకునిన్ను-నిర్వహించుప్రభువేముందుభారంబు
మోపియున్నట్టి- వారలంబిల్చెదయనింపు॥ దే॥

---

16. ౧౬

## దీనాలాపన.

రా. కేదారగౌళ. తా. ఆది.

పొందుగోరియుందు బికారి- మొరవినుము దేవ-
పొందుగోరియుందు బికారి= పొందులోకమందుగో
త్రి- సందియమును బొందజారి - మందమతిని బొందితే
రి- డెందమందు గుందిచేరి॥పొందు॥

1 నిండు ప్రేమచేతనన్నేలు-నినుమఱచినందు
కు-గండములనుబడితినిచాలు-అండబాయకుండతూ
లు- కండబలిమి మెండుగూలు-దండనధికముండమేలు
దండిపదవినుండుపాలు॥పొందు॥

2 చింత లేకగడిపితినోడు- పనివలనవచ్చు- సం
తసంబులెల్లనుకీడు= యింతమాయసంతగోడు- నెం
తయనుభవింతుపాడు- అంత మొందనంతవీడు- యిం
తదినాకెంతతోడు॥పొందు॥

3 ఎందుబోదునందు దిక్కేరి-నాకొరకు మరణ-
మొందనిన్ను గల్పువారేరి= అందరునిను జెందుదారి-
సందను వృత్తియందుజేరి- కొందెడ యానందవారి-
యందుమునుగుచుందు నిమారి॥పొందు॥

james 24-



17. ౧౭.

## సైతానును విసర్జించుట.

రా. జంఝూటి. తా. అట.

నన్నంటరాకు (ఓ సైతానా) నన్నంటరాకు= న
న్నంటరాకు నే- నిన్నంటిదిరిగినే- నన్నింటజేడితిని- నె
న్నంటికికనంట= ఎన్న శక్యముగానిమహి- మోన్న
తుడు తనసుతునిద్వారా- యున్న విధమునమార్పు జే
సి-నన్నుగైకొన్నాడుగాన॥న॥

1 సారహీనంబు (నీ క్రియ జేయ) ఘోరనరకం
బు= నేరనప్పుడునిన్ను- జేరినందుకు దుఃఖ- భారంబు
నొందితే- సారిరోసితినిన్ను= గారడంబులుబల్క-నా
మది- పూరజేయకులంతు వేనీ: నోరుమూయు నేసు
ప్రభుకరు-ణారసముచే- పోరిగెల్తు॥న॥

2 నారక్షకుండు (నిను గద్దించు) దూరంబై యుం
డు= పోరిమానుమ్యావ- తారికొండనుమూడో-సారి
శోధనలోని-న్బారదోలెనువాని= జేరినే బలశాలినై
బలు-ధీరతనునాత్మాయుధోత్కర-దారినై యున్నాను
యేసుని- పేరునేస్మరించి గెల్తు॥న॥

3 ఆసక్తినుండు (పేరులోని) వాసమైయుం
డి= యేసుమారణప్ర-యాస వార్తలు దెలియ-జేసిన

ప్పడునీవు- మోసపర్చుటజూచి= ఆసమీపమునుండి వెన్కకు దోసిననుగ్రించెనా ప్రభు- దాసినైయున్నా ననినుకడు- రోసిసేయున్నాను సత్యము॥న॥

---

18. ౧౮.

క్రీస్తేదిక్కని పాపమొప్పుకొనుట.

రా. కేదారగౌళ. తా. ఆది.

దిక్కులేనివాడనో ప్రభో(నీయండజేరి)మ్రొక్క సేవజేతునో ప్రభో= మ్రొక్కివిన్నవించువారి- యక్కరలనుదీర్చ సత్య- వాక్కునిచ్చియాదరించు- నక్కువైన దేవతనయ॥దిక్కు॥

1 ఘోరపాపభరము నెల్లను (మోయుచునలయు) వారలు౽ర రండటంచును= భూరిదయనుబిలిచియున్న-సారవాక్కు లెరుగకధిక= భారమొందితునకునీదరి-జేరితినన్నాదరింపుము॥దిక్కు॥

2 బలము లేనివాడనో ప్రభో (కే) వలముపాపములను జేసి-యలసితిని ప్రభో-ఇలను నేనొనర్చినట్టి-కలుషజాలములనునీవు- దొలగజేసియాత్మకధిక- బలమునొసగిమనుపుమయ్యా॥దిక్కు॥

3 పామరుండనాటవల్లను(నే నెరుగనైతి)క్షే
మమిచ్చుపదవులెల్లను = కామక్రోధలోభములను-
ఖేదమ్మునవిడచియేసు- నామమందువిశ్వసించి-క్రో
మమునువర్తింపజేయు॥దిక్కు॥

4 మిక్కుటంపుపాపినోప్రభో (నేగ్రక్కితినెడి)
కుక్కవంటివాడనోప్రభో- పుక్కిటపురాణములను-
గ్రక్కునవిడలేకవిడచి-నిక్కమైనపదవివెదకి- చక్కికి
నే తెంచితిపుడు॥దిక్కు॥

5 వందనంబొనర్తునోప్రభో- (నాడెందమంద
లి) సందియములణంచుమోప్రభో= సందియమెడ
బాపివేద-మందునుండుసారవాక్య-నందపదవులనుభ
వింప-డెందము వెలిగింపవయ్యా॥దిక్కు॥

---

19. ౧౯.

లోకవిషయమై జ్ఞాని విసుకుట.

రా. శుద్ధకాంభోజి. తా. జంపె.

విసుకదే ప్రాణంబు- విజ్ఞానికిలను- పొసగు వైరా
గ్యంబు-పుట్టదేతలను= అసదుగానట్టికష్టానుభవమే
గాని-యసదృశానందఫలమొసగునదియేది॥వి॥

1 మును పేదియుండెనో - వెనుకనదియేనుండును -
మునుపు వెనుకను - మధ్యముననున్న దదియే = జనరం
గక్రొత్తమై - యుప్పన్నమగునట్టి - ఘనకార్య మొక్క -
టియు - గానంగరాదు ॥వి॥

2 వినినదే వినవలయు - కనినదే గనవలయు - తిని
నదే తినవలయు - తృప్తి లేదెందు = మనసు నిండించు
నూ - తనవిధంబొక్కటైన - యనుభవించను దొరకద -
వనిలోనకటా ॥వి॥

3 కూడినదే కూడుచును - యాడినదే యాడు
చును - పాడినదే పాడుచును - పల్కినదే బల్కుచు =
నేడు యేవిధమో వే - య్యేడులకు నావిధమే - చూడగా
నూతనమగు - చోద్యంబు లేదు ॥వి॥

4 అందినదే యందుచును - పొందినదే పొందు
చును - సందించునదియే మరల - సందించవలయున్ =
ముందొనర్చినపనియె - మొనసి వెనుక నొనర్చు - నందు
జూచిన క్రొత్త - యగు విధము లేదు ॥వి॥

5 నేర్చినదే నేర్చవలె - చేర్చినదే చేర్చవలె - కూ
ర్చినదే గూర్చవలె - క్రొత్తమరి లేదు = మార్చరాక
యె మరల మార్చబడుచున్నట్లు - తీర్చి మునుచేసినదె -
దిరుగు నెల్లెడను ॥వి॥

6 పుట్టుఫలమేమరల - బుట్టుచుండును గాని - పు
ట్టదిక వేరొక్క - పోల్కె నైమెభువిని = చెట్టువిత్తనమె
యా - చెట్టుగా జన్మించు - పట్టిజూచిన క్రొత్త - పనియందు
లేదు॥వి॥

7 తనువుపోలిక నొక్క - తనువుజన్మించునా -
తనువింద్రియములెయ్యా - తనువందు బొడమెగా = ఘ
న కార్యబీజ - మొక్క - విధంబెకానిమే - తనువుననుజూ
చినా - తనవిధము లేదు॥వి॥

8 పుడమిమీదనుమొద్ది - బుట్టునోయది మరల -
పుడమిలోన నెగలసి - బుగ్గియైపోవుగా = పొడమినది యే
మరల - బొడముచుండును గాని - కడకైన నొక క్రొత్త -
గన్పించదందు॥వి॥

9 ధరణిమీదికి దిగం - బరుడగుచునే తెంచు - మ
రణమప్పుడు దిగం - బరుడగుచు బోవుగా = నరుడు పుట్టి
ననాడు - సరుకెద్దియును తేడు - మరణమగునాడొక్క -
సరుకు గొనిపోడు॥వి॥

10 ఒక్కతరము పోవు మరి - యొక్కతరము జనుదెం
చు - సకలవంశములిట్లు - సమసిపోచుండుగా = యిక్క వా
రి పేర్వెంపు - లెచ్చోట నేమాయె - నొక్కడైన చెప్పాట
సుర్విలో లేదు॥వి॥

11 ఏటివంకలుదీర్చ- నెవ్వానికలవిము - న్నీటి
మూకుడు సేయ-నేర్పరియెవండు= మోహైనమనసు
నంపు-లుదీర్చుగురువెవడు-కోటిధనమిచ్చినను-కుంభి
నిని లేడు॥వి॥

12 ధరణిలో నరరూపు- దాల్చిపాపులకొరకు-
మరణమై లేచుస- ద్గురుడైనయేసు= చరణాబ్జముల
సేవ- సారమిదియొక్కటే- పరమఫలమిదుసుఖ -
ప్రాప్తియొనరించుఁ॥వి॥

13 అరుదైనక్రీస్తుప్రే- మామృతముపానించి-
దురితాగ్నికీలలకు- దొలగువాడెవడో= నెరినాతడెరి
గి- ధరణింగలసుఖములెల్ల- మరివట్టిమాయలని- మొ
రలెట్టకున్నె॥వి॥

---

20. ౨౦.

## క్రీస్తుకు కృతజ్ఞత తెలుపుట.

రా. సెహానా. తా. ఆది.

యేసునాథా రారారా- నా- జీవనాథా రారా
రా॥యేసు॥

1 దోషములకొరకునీవు-దోసిలొగ్గితివితండ్రి॥
యేసు॥

2 కృపలోమమ్ములను - కూర్చియున్నావుతం
డ్రి॥యేసు॥

3 నీచులను ప్రేమించి - నీకరుణజూపినావు॥యే॥

4 నీతిమంతులకు - నిత్యజీవమిచ్చినావు॥యేసు॥

5 పొందరానికష్టములను - పొందియుంటివితం
డ్రి॥యేసు॥

6 లోకనాథునిజయించి - లోకులనురక్షించితి
వి॥యేసు॥

7 పొందజాలనికృపను - పొందియుంటిమితండ్రి
॥యేసు॥

8 వేడుకతోమేము - వేడుకొందుముతండ్రి॥
యేసు॥

---

21. ౨౧.

## సత్యమార్గానందము.

రా. సావేరి. తా. అట.

ఆనందమానందము-(పర)మానందమానందము=
ఆనందమానందమానందమని మే- మాదికారణుండై
నయెహోవా- వానందనునిమధురమైనప్రేమమార్గ-
మందినందుకుస్తోత్ర- మర్పింతుమికమా॥కానంద॥

1 కల్లవేల్పులపూజ- కొల్లకొల్లగజేసి- తుల్లిప
డుచునున్న ద్రోహాత్ముల- నెల్లరక్షించను-కల్ల లెడబా
పను-చల్లనౌశుభవార్త- సమకూడెనికమా॥కానంద॥

2 బొమ్మపూజలుజేయ- బోదాముగుళ్లకన-పు
ష్టురానియ్యకమండిపడిరి- బొమ్మపూజలెల్ల-పొల్లయి
నవని తెలిసె-పూజ్యుడగునిజదేవు- పూజింతుమికమా॥
కానంద॥

3 సతముగానిలోక- బ్రతుకుమేమాశించి- మి
త్రిమీరినడుచుచుగతిగానక- వెతలుబడుచునున్న-ప
తిభ్రష్టులగుమాకు- అతిప్రేమనిజదేవు- డగుపడ్డెనిక
మా॥కానంద॥

4 దేవాలయంబులో- భావంబురంజిల్లు- పర
మార్థమగుబోధప్రాప్తించెను- దేవచిత్తమంత- తేట
గా దెలిసెను-కలనుబొమ్మలపూజ- గావింపమికమా॥
కానంద॥

5 యేసుక్రీస్తుప్రేమ-యెరుక లేనప్పుడు-ఇరుగు
పొరుగునకల-హమెప్పుడుండె-యేసుక్రీస్తుప్రేమ- యె
రుగబడినందున- ఇరుగుపొరుగుస్నేహమిమిడియుండె
నుమా॥కానంద।

6 జాతిహీనులమంచు- ప్రీతినూరెడవిడి- రో

త్రగా నేం చిరి లోకులంత - జాతిద్వైపమునకు - రోత
యౌనని తెలసి - ప్రీతిమార్గంబునకు - పిలవబడితిమిని
మా॥కానంద॥

7 లోకజ్ఞానులుగూడ- నేకరక్తంబుచే - నెల్లజ
నులుగల్గిరేదికులము- ఆకులంబీకులం- బనుటయజ్ఞా
నమని- యందరొక్కట- నెనూట-లాడినారికమా॥కానం
ద॥

8 ఆదిమానవుడైన - యాదాము వంశమున-
భేదమించుక లేక పెరిగితిమని- వేదమూలంబుగా- పా
దుకొనె సత్యంబు- భేదింపనిక నెవరి- చేతగాదికమా॥
కానంద॥

9 సత్యమెరుగనివారు- వ్యత్యస్తపర్చిన- వ్యాస
నమొందము మేము- విసుకుపడము-నిత్యమేసు నియం
ము- నిలిచిసారమునొంది- నిందపాలై నభయమొంద
మికమా॥కానంద॥

10 పెండ్లిండ్లలో ద్రావి- పేలుటలుతూలుటలు-
పెనుగులాటలతోడ పెండ్లాయెను - పెండ్లియేసుని
సభ- కుండుసంబంధంపు- దండిజ్ఞానంబునకు-దగబో
ల్చిరికమా॥కానంద॥

---

22. ౨౨.

క్రీస్తుని ప్రేమ అనంతమైనదని.

రా. జంఝోటి. తా. ఆది.

యేసుని ప్రేమ- నే నెంతని వర్ణించగలను= దోస
కారుల కొరకై క్రూర- యాసమరణంబునొందె॥ యేసు॥

1 పాపము జేసి దైవ- శాపము నొందనై యున్న
= పాపులగా వ ప్రేమ- జూపబడుట చోద్యముగదా॥
యేసు॥

2 మంచి జత కానికి యొక -మంచివాడీ రీతి సన్మ
=తించి మరణంబు నొందదె-గించుట యరుదైన ప్రేమ॥
యేసు॥

3 ఎంత గొప్పైన ప్రేమయిది- ఎంత విం త్తైన ప్రే
మ= ఎంత దలపోసిన మది- కిం త్తైన కారణము దెలియ
దు॥ యేసు॥

---

23. ౨౩.

రక్షకుని పిలుపు.

రా. దేశీయ కాంబోది. తా. జుల్వా.

రండు రండు పాపులారా- ఇందు నెమ్మదిత్తుననుచు-

వండిదయాపరుండుయేసు- రండనిపిలిచె= అండలే
నివారమైప్ర- చండపాపములనుజేసి- గండమునబడ
కుండయేసు- గుండాయె హోవాదండను॥రండు॥

1 ఎట్టివారలైననునా- తట్టుకువచ్చినవిడనని-
గట్టిగావాగ్దత్తమిచ్చి-గుట్టుదెల్పెను=వట్టిభ్రమలకట్ట
డవిడ-గొట్టినెట్టిప్రభుడయ్యకని- పెట్టినమ్మిముట్టువిడక-
పట్టుచేకడముట్టుదాము॥రండు॥

2 అడ్డిలేదురండురండు- దొడ్డరక్షకుండుమన
కు- అడ్డపడుటచేత- ప్రాణగొడ్డమొందెను= అడ్డిడీ
ర్చబడ్డదింక- ఎడ్డెతనముచెడ్డతనము- లడ్డవాట్లుమాని
స్వామి- బిడ్డలౌటకొడ్డుకొనుచు॥రండు॥

3 ఎంతదివ్యమైనమాట - లెంతనవ్యమైనసూ
టి- ఎంతఘోరపాపినన్ను- చింతదీర్చెను= శాంతనీతి
చేత- నెంతపంతమాడనేమిఫలము- నంతప్రేమ- వం
తుడేసుని- శాంతనీతినొందకున్న॥రండు॥

---

24. ౨౪.

## యేసుని రమ్మనుట.

రా. రేగుప్తి. తా. ఆది.

యేసునాథుడారమ్ము- (నా)దోసములెల్లగజిమ్ము

= ద్రోసిలొగ్గిన-దాసాళినిపర- వాసులజేసే-శ్రీసనా
థుడవు॥యేసు॥

1 నరకపాత్రుడను నేను-(నను) కరుణించనునీ
వేను= నిరతము దురితపు-భరితుడనై నిను-మరచినం
దుకు- నెరిచింతించితి॥యేసు॥

2 బలహీనుడనే సయ్యా-(నను)బలపరుచుము మె
స్సయ్యా= అలసిసొలసిని-న్నలుముకొనుటకై- యిలను
నిన్ను నే- గలయ వెదకితిని॥యేసు॥

3 నన్ను విడువనటంచు-(నీ)వన్న పలుకులుస్మరిం
చి= కన్నతండ్రికృప- నన్ను విడువదనిగ-న్నదినాహృ
ది- నున్నదియాకృప॥యేసు॥

---

25.

సువార్త ప్రకాశారంభదశ.

రా. ముఖారి. తా. అట.

పిల్లనేచిన్న పిల్లనే (ఓ యేసునాథా) పిల్లనేచిన్న పి
ల్లనే= తల్లిదండ్రులుతాతముత్తవ- లెల్లబొమ్మలపూ
జ జేయుచు- కల్లమార్గమునందువిడిచిరి- తల్లడించుచు
నిన్ను జేరిన॥పిల్లనే॥

1 వల్లనే యికనదివల్లనే (ఓయేసునాథా) వల్ల
నే యికనదివల్లనే= చల్లనిశుభవార్తబోధ- లెల్లమా
నసముందుజొచ్చెను- తొల్లి జేసిన నేరములు-నీ-వల్లబో
ననినమ్మియున్న॥పిల్లనే॥

2 ముల్లైనేపాపపుముల్లైనే (ఓయేసునాథా)
ముల్లైనే పాపపుముల్లైనే= పొల్లులును దుర్వాంఛలు
సుసుది - నెల్లగూర్చిన దుష్టులకునే - తుల్లిపడుచు భ
యమునసొమ్మ-శిల్లినిన్ను జేరియున్న॥పిల్లనే॥

3 కుల్లునే పెంటకుల్లునే (ఓయేసునాథా) కుల్లు
నే పెంటకుల్లునే= యుల్లమిాస్థితిపొందెనీ- నల్లచేతం
దోమబడిరా. జిల్లుచుసత్యంబునకావ-ర్థిల్లుచునిన్వాం
బడించిన॥పిల్లనే॥

4 చెల్లదే (నిన్విడ) జెల్లదేఓ (యేసునాథా)
చెల్లదేనిన్విడజెల్లదే- అల్లిబిల్లిగనిన్ను నే- నల్లన వెం
బడించుటచే- నుల్లసంబులుగల్గజడియక తలిదండ్రిప
బంచునమ్మిన॥పిల్లనే।

26. ౨౬.

## క్రీస్తుని రక్షని వేడుట.

రా. సెహాన. తా. ఆది.

పరమరాజా రారాజా (దేవా) పరమరాజా రా
రాజా=పరమరాజా నాకును-స్థిర మోద మొదవించు
నట్టి-పరమపురిని జేర్చనీవు- కరుణతో రారమ్ము వేగ॥ ప
రమ॥

1 పామరుండనైన నన్ను-బారదోలక నీమ-ప్రే
మతోడ నన్ను జేర్చి- బ్రోవ వేగిరము రమ్ము॥పరమ॥

2 పాతకుండనైన నన్ను-రోతగనెంచక నీదు-నీ
తిమార్గమున నను నడిపి- నీతట్టు కేడించి నిల్పు॥పరమ॥

3 దిక్కులేనివాడ నీదు-చక్కి కీరప్పించి నన్ను-
ప్రక్కలో దాచి కాపాడి-మిక్కుటముగా నాదరింప॥
పరమ॥

4 అంధుడనయ్యా నేను ముక్తి-విందు ననుభవిం
చనా- యంధత్వమును విడగొట్టినీ- సుందరపురమం
ము జేర్చు॥పరమ॥

5 పలుమారు నీదు గాయ-ములను రేపుచుండు
నా- మలిన కార్యములను దలచి-మరిమరి దుఃఖించితిని॥
పరమ॥

6 పొందుగా నాడెందము నేడి- మందిరంబులో
నిన్నా-నందంబుతోడ జేర్చి-వందనంబొనర్తు నెపుడు॥
పరమ॥

---

27. ౨౭

రా. ముఖారి. తా. ఆది.

చిన్నపిల్లను-(నీ)సన్నిధికివచ్చితి-చిన్నపిల్లను-(నే)
నిన్నే నెరనమ్మితి॥చిన్న॥

1 చిన్నపిల్లలదయతో- సన్నిధికిరావించి- ము
న్నయాశీర్వదించి- యున్న(నా)యేసన్న॥చిన్న॥

2 చిన్నపిల్లలందు-(నీ)కున్న ప్రేమనుగాంచి-స
న్నిధికివచ్చియున్న- నన్నేలుమేసన్న॥చిన్న॥

3 దిక్కునీవేయటంచు- మ్రొక్కి ప్రార్థించు
వారి-యక్కరలుగడిపినట్టి-చక్కనియేసన్న॥చిన్న॥

4 ఎన్నశక్యముగాని- ఎన్నోగండములనుండి-
నన్ను విడిపించుచు- నున్ననాయేసన్న॥చిన్న॥

5 నిన్ను ప్రేమించుటందు - నిన్ను సేవించుటం
దు- నన్ను బలపర్చుమంచు-నిన్నడిగెద నేసన్న॥చిన్న॥

6 బాలప్రాయమునాఁడే- జాలిగలపిలుపునాకు-
మేలుకై వినిపించినట్టి- జాలిగలనాయేసన్న॥ చిన్న॥

7 నానాటసీమ సత్య-న్యాయమహాచట్టములను-
మానక ధ్యానింపనన్ను - నురగించుమేసన్న॥ చిన్న॥

8 దినదినమునానడ- తనుక్రొత్తజేసినీ- ఘనము
నక్తైబ్రతికించు- కొనుమునాయేసన్న॥చిన్న॥

---

28. ౨౮.

## బోధకులకై ప్రార్థన.

రా. శంకరాభరణము. తా. ఆది.

అడుగుచున్నామో దేవ- కడుదయతోఁగావ= నె
ఱుగులమైన మేముని- న్నడుగుటకు యేబిడియమొంద
ము= యడుగుడిమీఁకిడిమొదనంచు- నానతిచ్చినవా
గ్దానముగని॥యడుగు॥

1 వేడుకలరగ గూడినినుగొని - యాడియడి
గెడునీదుభక్తుల= గోడుగని దయతోడనెప్పుడు- వీ
డకను నెరవేర్తువనిని॥న్నడుగు॥

2 సారెసారెకునిన్ను విడిచి- ఘోరదురితపుభా
రమందు= జేరినినుమరచితిమిగదనూ- క్రూరతనమె
డబావుమునిని॥న్నడుగు॥

3 మస్తాన్యుడమహాత్ముడబోరగ- శ్రేష్ఠమగుమహా
నిష్ఠతోడుత= కష్టమునకవాని గెల్వ- బుష్టినిబుట్టించు
మనిని॥న్నడుగు॥

4 తోరమగువిశ్వాసనిరీక్షణ- కూరిమివిమలా
త్మవరములు= వారకనుహృదయాంతరంబుల- జేర్చి
మము వెలుగించుమనిని॥న్నడుగు॥

5 మోదమొప్పగనీదువాక్యము- మేదినిపైబో
ధపరచెడు= బోధకులపైశోధనంబులు- పొర్లిరాకుం
డాదరింప॥నడుగు॥

6 దురితములచేభరితులయ్యెడు- నరులపై నీక
రుణజూపి= గురుతరంబగుమారుపుట్టక- వరముగాస్థి
రించుమనిని॥న్నడుగు॥

7 రోగములచే సేగనొందుచు- జాగుసేయక
నిన్నదలచుచు= బాగుగోరుచున్న భక్తుల - రో
గములు వెడలించుమనిని॥న్నడుగు॥

8 ధరణిపైనమరణమయ్యెడు- తరుణమందో
రుణకలితా= పరమపురమునందుజేరి- వరసుఖంబు
లనుభవింప॥నడుగు॥

---

29. ౨౯

## విశ్వాసు లాదరణ.

రా. ముఖారి. తా. అట.

యేసు మేఘారూఢుడై (వచ్చు) నేను మేఘారూఢుడై= యేసువృతనయందు- నాసక్తితో బ్రతుకు- దాసజనుల బ్రోచును- వాగ్దత్తంబులీడేర్చును॥యేసు॥

1 దిక్కు లేనట్లుంటిమి (యిపుడు) దిక్కు లేనట్లుంటిమి= దిక్కు లేనట్టుమిము- దిగనాడనన్నట్టి-చక్కనయ్యనుజూతుము- పరమందు-సహవాసమును జేతుము॥యేసు॥

2 సూర్యుడుదయించినట్టి (నీతి) సూర్యుడుదయించునట్టు= సూర్యుడుదయంబైన-పొరుగు-చీకటివలెను- కార్యభేదమువల్లను- నారీతి-గానగుదురా వేళను॥యేసు॥

3 నేనుండెడిచోటున (మీరుండ) నేదిరిగివత్తుననేనే= తానుండెడిచోటు-తనశిష్యులకునియ్య-బూనితండ్రిని వేడెను-యేసు- మానితంబగుప్రేమను॥యేసు॥

4 యెంతోభాగ్యంబైనది (విశ్వాసి) కెంతోభా
గ్యంబైనది= యెంతభాగ్యంబైన- దంతమందున నుం
డు- సంతోషమునుజూపివా-గ్దత్తంబు- చింతలన్నిటి
దీర్చును॥యేసు॥

5 మరణంబుచేసూరమై (యున్నట్టి) మనసోద
రులజూతుము= నిరతానందమహిమ- పురమందునె
ల్లరము- పరిపూర్ణమగుస్నేహము- యెడతెగని-బం
ధుత్వమునందుము॥యేసు॥

6 ఇప్పుడేసునిసన్నిధి (విశ్వాసి) కెంతోమధు
రమైనది= ఇప్పుడీమధురంబు- చెప్పతరముగాదు-అ
ప్పుడనుభవింతుము- ప్రత్యక్ష- మైనసన్నిధిమధురము॥
యేసు॥

7 నిత్యజీవకిరీటము (దాల్చెదము) నెయ్యంబ
నుభవింతుము- నిత్యజీవకిరీట- నియమంబునకుక్రీస్తు-స
త్యసువార్తెయని- చాటింతు- సర్వోన్నతునికృపయ
ని॥యేసు॥

---

30. 30.

## లోక నిశ్చింత.

రా. నాథనామక్రియ. తా. ఆది.

జీవనాచింతింపకుండు(నన్ను)గావవచ్చినవాడు

కరుణామయుండు॥జీ॥

1 జీవమాచింతించి- క్షితినిన్నారడైత్తు- జీవిం
చనైనద్ది-జేసెదవాగావుననీచింతక్రాంతముల్వీడలిం
చి- దేవుండెపోషించుదాతయనినమ్ము॥జీ॥

2 గగనమార్గముబోవు- ఖగములుహన్నవు త
గగోసికొట్లలోదాచుకొనవు- అగణితపక్షులకాహా
రమువ్వంగ- బెగడెనవెందుకు బెంచునిన్నతడు॥జీ॥

3 పక్షివృక్షాదులపైనింతప్రేమచే-భక్షణలిచ్చు
చుబాలింపంగా- వృక్షుంబులకన్న శ్రేష్ఠంబులుగనెం
చి- యక్షయంబుగనేలునల్పవిశ్వాస॥జీ॥

4 మిశ్రయీయామునందు- మిగులబాధలనొందు-
మిశ్రేలునకుమన్నానివ్వలేద- ఆశ్రయించుము దేవు డ
త్యంతకృపచేత- నాదరించిబ్రోచు- ననినమ్ముమికను॥
జీ॥

---

31. ౩౧.

పాపమొప్పుకొనుట.

రా. నాదనామక్రియ. తా. అట.

పాపినయ్యా-నే-పాపినయ్యా-కాపాడవయ్యా

పాపభారమునుండి- బాపుమయ్యా-నన్ను- పాపభా
రమునుండి- బాపుమయ్యా॥పాపి॥

1 కావుమయ్యా-నను-గావుమయ్యా-నా-పా
వనయ్యా-జీవమైనయేసు- నీవేనయ్యా-నా-జీవమైన
యేసు- నీవేనయ్యా॥పాపి॥

2 ప్రాపునీవు-నా-ప్రాపునీవు-న-న్నోపినావు-
నాపాలిదైవమా-నన్నుగావు- ఓ- నాపాలిదైవమా
నన్నుగావు॥పాపి॥

ఏలవయ్యా-న-న్నేలవయ్యా- మేలియ్యవ
య్యా-చాలానమ్మితికరుణా-శాలివయ్యా-నే-చాలా
నమ్మితికరుణా- శాలివయ్యా॥పాపి॥

మంటివాడ-నే-మంటివాడ-న-న్నంటివీడ-
కే-న్నంటికైనని-న్నంటువాడ- నేనె-న్నంటికైనని-
నంటువాడ॥పాపి॥

5 శాంతిపరచు-నను- శాంతిపరచు-నీ- శాంత
ముడుచు-నా- సొంతమగుదనుక-చెంతనునుచు-నేనా-
సొంతమగుదనుక- చెంతనునుచు॥పాపి॥

---

32. 3౨.

క్రీస్తు మరణము పాపిది.

రా. అసావేరి. తా. ఆది.

దేవునాజ్ఞలుమీర- చావుగ పాపి-జీవమైయున్న యేసు- చావునీదేనుపాపి॥ దేవు॥

1 నా దేయీచావుయంచు- నమ్ముము పాపి- నీ దోషముల కైయేడ్చి- నీచత్వములనువీడు॥ దేవు॥

2 చావనైయున్న క్రియలు - చాలునునిన్ను- బ్రోవనైయున్న యేసు-సేవనిరతంబు జేయు॥ దేవు॥

3 శక్తిహీనుండవంచు- శాపము బాప-యుక్తమా ర్గంబుసర్వ- శక్తుండెజూపెనీకు॥ దేవు॥

4 నమ్మిజీవించనీకు- నెమ్మదినిచ్చు- నమ్మహాత్ము నియుచితం-బైనప్రేమజూడు॥ దేవు॥

5 ఎంతో కారుణ్యమిద్ది- చింతనజేయ - వింతై తోచుటేగాక- విశదంబుగాదునీకు॥ దేవు॥

---

33. 33.

పాపులను బిలుచుట.

రా. యమునాకళ్యాణి. తా. జుల్వా.

పాపులారరండు- (దైవ) ప్రాపునబ్రతుకుండు-

ఎల్లపాపులారరండి॥పా॥

1 రండుపాపక్షమముదొరుకు- గుండెదిగులే
లమీకు- నిండుప్రియుండు యేసుండుమీకండయ్యె॥
పా॥

2 అండదొచకున్న మిముల-దండకురండనినప్ర
భువ- ఖండదయుండుత్తముండుక్షముండు॥పా॥

3 అన్న పానములకుమీ-రాసపడినట్టుగనా-
సన్నంబైయున్న సర్వోన్నతునికృపనొంద॥పా॥

4 ద్రవ్యమీయకుండకృపను - ద్రావవచ్చురం
డురండు- దివ్యంబగునవ్యంబగుసవ్యంబగుబోధనకు॥
పా॥

---

34. 3౪.

## సిలువ ధ్యానము.

రా. ముఖారి. తా. ఆది.

ఏమినేరంబులేక-యీమరణస్తంభము-నేలమో
యనాయను-(నాయేసు) ఎంతఘోరములాయెను=
ఈమానవులుమెరుప- లేముబైటకుదీయు- నేమినేర
ముదొచెను॥ఏమి॥

1 మున్ను దీర్ఘదర్శు- లెన్నినరీతిని - కన్నెకడుపునబుట్టిన- (నాయేసు) వన్నెమీరంగబెరిగిన= చెన్నైననీమేను-చెమటబుట్టంగనీ-కిన్నికడగండ్లాయెను ॥ఏమి॥

2 కన్నతల్లియట్టి- కడగండ్లుగాంచిన-కడుపేరితినోర్చును-(నాయేసు)గాంచనేలనుగూలును=నిన్నెరిగినట్టివారు- నీపాట్లుగనియేడ్చు - చున్నారీవేళను॥ ఏమి॥

3 తొలివాగ్దత్తముదీర్చ- దొరబుట్టెననితోచి-తూర్పుజ్ఞానులువచ్చిరి-(నాయేసు)ధూపంబులర్పించిరి= పలుమారునీకొరకు - కలువరించినజనులీ- కర్తంబునోడిగట్టిరి॥ఏమి॥

4 నిన్నుగొప్పచేయ- నెన్ననలవిగాక-మున్నదూతలువచ్చిరి- (నాయేసు) మిన్నునస్తోత్రించిరి= కన్నులారనిన్ను- గనినభక్తులంత- ఘనసంతోషంబులందిరి॥ఏమి॥

5 హేరోదునిన్నుజంప-నెంతవెదకించిన-ఎచ్చోటదాగుంటివి-(నాయేసు)ఎట్లాతప్పించుకొంటివి= ఆరేయినిన్నుబట్ట-నరుగుదెంచినవారి- నేరిగేపట్టుబడితివి॥ఏమి॥

6 ఎన్నిపర్యాయములు - పన్నియుపాయముల
ను- పట్టిచంపంగదలచిరి- (నాయేసు) కొట్టికసిదీర్చ
వెతికిరి= అన్నిపర్యాయము- లందకుండంగదిరిగి-న
ట్టిపట్టేదీతరి॥ఏమి॥

7 నన్నామీరు వెదుకు-చున్నారటంచుబల్క-
మన్ననగూలిపోయిరి- (నాయేసు) మహిమఃగనలే
కపోయిరి= నిన్నప్పగించునట్టి- నీశిష్యునకునేమి- నే
పమరులుజూపించిరి॥ఏమి॥

8 నీదాసుడగుయూదా-నీమహత్వంబునెరిగి-
నీజాడజూపించెను- (నాయేసు) నీచాత్ములనుగూడె
ను= ఆదాయమునుగోరి - ఆత్మసుఖమునువీడి - అప
మారుతామోసెను॥ఏమి॥

9 దురితాత్ములబార-దోరినట్టుగరిపుల-దో
లరాదుగనిప్పుడు- (నాయేసు) తూలిపోతివియిప్పు
డు= పరమాశ్చర్యముజూడ - బలమేడదాచినావు-
ప్రభువైనయేసునాధుడా॥ఏమి॥

10 సర్వమానవులను - సంరక్షణంబుసేయ- స
ద్బోధలనుజేసిన- (నాయేసు) యద్భుతంబులుజేసిన
= గర్వమునసీయూద- గణమునినునమ్మక-కడితేర్చద
లచిరేలను॥ఏమి॥

11 వీరికియ్యబడిన- వేదమార్గంబుదప్పి - విచ్చల
విడినడువగ-(నాయేసు) వేదమార్గంబుదెల్పగ= వీ
రివలెనుగాక- వేరుదెల్పితివంచు- వెక్కసంబుగదో
చెగ॥ఏమి॥

12 దివ్యమైనబోధ- ద్రిప్పిపులిమిపుచ్చి- తెప్పున
మాయసాక్షులన్-(నాయేసు)రప్పించిపలికించిరన్
= సవ్యంబుగపిలాతు- సత్యమెద్దియోగని- సన్మార్గివ
నితీర్చెను॥ఏమి॥

13 ఈతీర్పునకువారి - కేమిదోచకగినిసి- ఏయు
డంచునశిల్వను- (నాయేసు) ఏకరీతిగబల్కను= నీ
తిమార్గంబువిడిపి- లాతుభయమొందివీరి- చేతులక
ప్పగించెను॥ఏమి॥

14 పండుగవాడుకను- బట్టినినువిడువదలచి- పర
గపిలాటడిగెను- (నాయేసు) నిరపరాధిగనెంచెను=
మండియూదులంత- మాకుబరబ్బాను- గాకవేరుగవ
ద్దిటన్॥ఏమి॥

15 అయ్యయోయూదులంత - నెయ్యంబుదప్పి
దైవ- బయ్యంబువిడిచిపూని- (నాయేసు) మొయ్య
శక్యంబుగాని= కొయ్యమూపునెత్తి- రయ్యనీకెంత
భార- మయ్యవెతజూడజాలను॥ఏమి॥

16 పిల్లలాట్లాడినట్లు- ముల్లులతోకిరీట- మల్లినెత్తి
నగొట్టిరి- (నాయేసు) పల్లరుపులధికమాడిరి= ఎల్ల
వారిలోనిన్ను- ఎగతాళిగావించి- మొగముమీఁదె
ల్లనుమిసిరి॥ఏమి॥

17 కొరడాలతోనిన్నుగొట్టి- కండ్లకుగంత- గట్టి
చేజరిచి వేడ్కను-(నాయేసు) అట్టివారెవ్వరంచును
= విరసభావంబునడిగి- వెక్కిరించుచునీ-వెంటబడి
వత్తురేలను॥ఏమి॥

18 ఏలెడివారునడువ- మ్రోలవస్త్రంబులను-
నేలబరిచినరీతిగా- (నాయేసు) మ్రోలబరిచిరియట్లు
గ= ఏలయీకోడిగంబు- లేలనీమీఁదగంటు- ఏమినే
రంబులేదుగ॥ఏమి॥

19 చాలాబాధించిక-పాలస్థలమునకువచ్చి- నేల
బాతిరికొయ్యను-(నాయేసు)జాలిరవ్వంతలేకను=
కాలుసేతులినుప- సీలలతోబిగించ- జిమ్మిరక్తంబుగా
రెను॥ఏమి॥

20 కుడియెడమలందుసిల్వ- గడిదొంగలను వేసి-
నడుమనిన్నే వేసిరి-(నాయేసు)గడినేరమనిదెల్పిరి=
చెడుగు లెప్పుడునీవు- చేసినట్టుగలేదు- చేటెరుగకిట్ల
జేసిరి॥ఏమి॥

21 నీచాత్ముఁడొకఁడు - నిజ్జనీల్లిబల్లెంబుతోడనీ - పక్కఁబొడిచెచావను-(నాయేసు)నీరునెత్తురుగారెను= ఏచియున్నట్టికస్తి - కెట్లునీయొడలుసైచె - నెంతోచోద్యంబుచూడను॥ఏమి॥

22 నీవుబల్కినవాక్య- నిజముగ్రహించలేక-నిందమాటలుగదలచిరి-(నాయేసు)నిన్నధికప్రశ్నలడిగిరి= భావమూఢత్వమున- బాధగ్రహించలేక-ప్రల్లదనంబులాడిరి॥ఏమి॥

23 నాదేవనాదేవ- నన్నేందుకైవిడిచి- నావంచుమొరబెడితివి-(నాయేసు)నమ్మితివిలోబడితివి= వేదనధికంబాయె- నేదిక్కులేనట్టు- యూదాళికగుపడితివి॥ఏమి॥

24 అంధకారముదేశ- మంతటగలిగెను- ఆవరించెనుసూర్యుని-(నాయేసు)ఆలయపుతెరచినిగెను= బంధస్తబంబునుండి- జహాలుగొప్పశబ్దముతో- బలికెదవేమిట్లను॥ఏమి॥

ఓతండ్రినీ చేతి- కొప్పించుచున్నాను-ఒనరంగనాయాత్మను-(నాయేసు)అనిప్రాణమునువీడెను= ఏతప్పితంబులేక -నీపాటునొందితివి- ఎంతోవింతైనిల్చును॥ఏమి॥

26 మరణమైనకొం - దరుసమాధులనుండి - యు
రిదిగాబ్రతికిలేచిరి-(నాయేసు)యద్భుతంబుగజూచి
రి=తిరుగామూడవనాటి-సరిలేతునను మాట-సత్యం
బుగాదనెంచిరి॥ఏమి॥

27 తెలిపిపిలాతుకిద్ది-నలుబదిమందినికా-వలిగా
సమాధికుంచిరి-(నాయేసు)వంచనానంచుదలచిరి=
వెలయమూడవనాడు-బలికినట్టు లేవకా-వలివాండ్రు
తెలియపరచిరి॥ఏమి॥

28 తెలిసిమరుగు జేయ- తెరవువెమకుమరుగాని-
పరమప్రభువంచునమ్మరు- (నాయేసు) పగదీరనట్లు
జేతురు= తులువయూదులకేమి-కలిమబ్బెనిందువల
న- బలుదోస మొడిగట్టిరి॥ఏమి॥

29 పాపాత్ములకుపూట- బడినవల్లనేయింత- పరి
తాపమరణమాయెను-(నాయేసు)ఎరిగేయనుభవిం
చెను= నాపాపఫలమునిన్ను-,వేపాట్లుబెట్టిచంప-నో
పితివయ్యప్రేమను॥ఏమి॥

30 దేవకోపాగ్ని చేత-చావనాయత్తమయిన-నా
వంటినీచపురుగును - (నాయేసు) గావనష్టంబువచ్చె
ను= నావల్లజేయబడిన- నానాయపరాధములకు-తా
నేతనప్రాణమిచ్చెను॥ఏమి॥

31 నిరపరాధమైన-పరమశరీరమునా-మరణశ్రమ లనుభవించెను-(నా యేసు)నరకావస్థలనుబాపెను= దురితాత్ము లెల్లతనను- నెరనమ్మిపరము చేర- తెరవు తేటగజూపెను॥ఏమి॥

32 ఎంతయమూల్యమైన - దెంతయనంతమైన- దెంతయగాధమైనది-(నా యేసు) యంతోయుచిత మైనది= ఎంతోవింతైనప్రేమ- ఏహ్యులమైనమాకు- ఏలకనుపర్చబడ్డది॥ఏమి॥

33 ప్రేమాతిశయుడనేను- ఏమాత్రుడనుమెన్న- నామానసమునకందను- (నా యేసు) నీప్రేమసారంబు దెలియను= పామరాళినిబ్రోచే-క్షేమాధికారినిన్ను-ఏమంచువర్ణింతును॥ఏమి॥

---

**35.** 3 ×

### క్రీస్తు మరణప్రయాస ధ్యానము.

రా. ముఖారి. తా. అట.

ఐదుగాయములొందినావా - నాకొర- కైదుగాయములొందినావా॥

ఐదుగాయములనా- యాత్మదలంపనా- కారాట

మెచ్చినదే- నీమైదీగెనావంటి-మర్త్యులపాల్జేసి- మర
ణమొందితివిగదే॥ఐద॥

1 గారమైననీశరీరరక్తముల-ధారమైకారినదా-
నానేరమాయయ్యది- భారమైనీపైని- ఘోరమైయొరి
గినదా॥ఐద॥

2 అందమౌనీతన్వు- గందిరక్తస్వేద - బిందువు
లైరాలెనే-యీ- చందమూహింపనా - డెందమ్ముభీతి
చే-గొందలమైతూలెనే॥ఐద॥

3 ఎల్లపాపముమోయు- నల్లదేవునిగొఱ్ఱె- పి
ల్లవునీవేగదా - నా- వల్లనానీకింత- యల్లాటబుట్టెనే-
చెల్లతాళదెయద॥ఐద॥

4 భంగమౌనట్టిదుష్పాపులగావ-నీ-ప్రాణమ
ర్పించితివా-యీ- సంగతిజూడనీ- సాహసమింకనే-
భంగినీజగతిమరువ॥ఐదు॥

5 ఆయాసమైననీ-యాపదలెల్లనే- నాలోచిం
పగనాత్మలో- నెడ-బాయకతద్దివ్య- పాదసరోజము
భాసిల్లునాయాత్మలో॥ఐద॥

6 తల్లికైనమరితండ్రికైననన్న-దమ్ములకైనలే
దే- కన్న-పిల్లలకైననీ- ప్రేమబోల్చుదమన్న- పృథ్వి
లోగానరాదె॥ఐదు॥

7 ఈప్రీతినీయొక్క నీమహాత్వంబిల- నెవ్వరూ హింతురౌగాక- ఓ- యెహోవాప్రభువాతద్ద- యోత్కట గాంభీర్య- మూహింపనీ కెతగుక॥ఐదు॥

---

36. ౩౬.

ఆశతో క్రీస్తుని చూతము రమ్మనుట.

రా. కాంభోజి. తా. అట.

రారెయేసునిజూతము- కోరికదీర- రారెయేసుని జూతము= రారెయేసునిజూడరారాజైనజీవా- ధారకరుణామృతసారమైయున్నాడు॥రారె॥

1 సారహీనమగుసంసారాబ్ధిలో జిక్కి - భార మనుచునీతనేరనివారికి - తారకమై దేవ కుమారుడు యేసు - వూరార్చుటుండుటకు - భూరిసహాయకారి యై చెయ్యూతకు= కోరియిచ్చుచు క్షేమతీరంబునకు జేర్చ - దారిజూపుచు మీవిచారముల్ దొలగించు॥ రారె॥

2 ఘోరమైనపాపభారంబు మోయుచు- దారి గానక తారుమారులైననరుల - కూరిమితో బిల్చుచు నారకబాధ - లూరక దొలగించుచు -నీరసులంచుభా

రంబుతా మోయుచు = ఓరిమధికము జూపి నేరంబు
బాపిశృం - గారమైన మోక్షద్వారమైయున్నాడు॥
రా రె॥

3 మేరలేనిదోషకారులందరికిని-ప్రాకారణంబు
గవరశరీరరక్తము గాల్చి - మారణంబైదైవము తీరనికి
నుక - పూరితంబగు న్యాయము - తీరుచుటచే చేరువా
యను సాక్ష్యము= ఆరక్షకుని నామమారాధించుచుక
న్న - లారా మోక్షమునందు తేరిచూతము వేగ॥ రా
రె॥

4 కారుణ్యుడును నిర్వికారుండు మురితోప- కా
రుండు శుద్ధాలంకారుండౌ యేసుని - యేరీతిగా వింటి
మో- ఆరీతి మోక్షారామమున జూతుము - సారవా
క్యధోరణి బడిపోదము = దారుణంబగు శ్రమలు బా
రుబారుగనున్న -పోరిదాటి ప్రభుని జేరి సుఖింతము॥ రా
॥ రె॥

5 ఆరమ్యపురిని ప్రేమారగించుచు నిత్య - మా
రోగ్యమును బొంది సారెసారెకు ప్రభుని- ఆరావముగ
స్తోత్రము-చారుతర దూతారాధనము జేతము-నోరా
రనా- పేరు నేపూరింతము= దూరస్థులైయున్న వార
లందనరక్త- దారోదకము చే చేకూరునట్లుగ జేయు॥ రా
రె॥

---

37. 32.

## పాపియందు క్రీస్తుని ప్రేమ.

రా. ముఖారి. తా. అట.

యేసు నన్ను ప్రేమించినావు-పాపినైన-నన్ను ప్రే
మించినావు-నన్ను ప్రేమించ మానవరూప మెత్తి- దా
నముగా జీవము సిల్వపైనిచ్చి - కన్న తలిదండ్రియన్న
దమ్ముల ప్రేమ- కన్న మించిన ప్రేమతో॥యేసు॥

1 తల్లిగర్భమున నేధరియించబడినపుడే- దురి
తుండనైయుంటిని-నా-వల్ల జేయబడెడియెల్లకార్యము
లెప్పుడేహ్యంబులైయుండగ॥యేసు॥

2 మంచినాలో బుట్టదంచునీ వెరిగినన్ మించ ప్రే
మించినావు- ఆహా- ఎంచశక్యముగాని- మంచినాలో
బెంచ నెంచి ప్రేమించినావు॥యేసు॥

3 నన్ను ప్రేమించనీకున్న కష్టములన్ని-మున్నే
యెరిగియుంటివి- యెరిగి-నన్ను ప్రేమించనీ- కున్న కా
రణమేమో- అన్నా దెలియమచిత్రము॥యేసు॥

4 నావంటినరుడొకడు నన్ను ప్రేమించిన- నావ
లనఫలముగోరు- ఆహా- నీవంటిపుణ్యునికి నావంటిపా
పితో కేవలం బేమి లేక॥యేసు॥

---

38. ౩౮.

## యేసు ప్రేమ.

రా. రేగుప్తి. తా. రూపకం.

నన్ను ప్రేమించినాడు- శ్రీయేసు- నన్ను ప్రేమించి
నాడు॥
నన్ను నిన్ను ప్రేమించి- సన్నిధికి రావించు-
నన్న యది సత్యవే- దాగమము తెల్పెను॥నన్ను॥

1 బాలురైనట్టిమమ్ము- ప్రేమించు-
బలహీనులము మేమని
మేలియ్య నేసుబల- శాలిమతిహీనులను
చాల ప్రేమించుచు- సర్వదాబోధించ॥నన్ను॥

2 మింటనుండి ప్రీతితో- నెనరైన-
కంటననుజూచిగాయు
ఒంటరిగవిడువడ- న్నింటనే ప్రేమింప
కంటిపాపనువలెను- గాసిపరమున జేర్చ॥నన్ను॥

3 యేసు క్రీస్తూరక్షకా- నేసునీ-
దాసినై చేరినాను
నేసమయుగాలమున- నీసన్నిధికి జేర్చి

భాసురంబగుపరమ-వాసిగానను జేయు॥నన్ను॥

---

39. 3ౘ.

పరమవిందు.

రా. యమునాకళ్యాణి. తా. జుల్వా.

విందుపరమందు పెండ్లి - విందుపరమందు= పొం
దుజనుల డెందము-లానందమునొందు॥

1 సత్యసంధుడైనయేసు - సామికిసభను= ని
త్యప్రధానముయెహోవా-నిర్ణయించెనురండు॥విం
దు॥

2 నీతికనికరములతోడ-నినుప్రధానము= ప్రీ
తిగానొనరించితినని-బలచెసత్యమురండు॥విందు॥

3 ఎన్నడువిడనాడనునే- నెంతమాత్రము= ని
న్నెడబాయనను మాట- నిజముదత్తమురండు॥విందు॥

4 తలచినట్టినాదుతలపు- తప్పదంచును= బలి
కినాప్రతిజ్ఞను- స్థిరపరచితిననెనురండు॥విందు॥

5 నిర్ణయించబడినయది- నీచక్రియలను=పూ
ర్ణముగా జేసెనికను- పొసగదనకునురండు॥విందు॥

6 సందియంబులేదులేదు - సామితప్పడు=

ఘుంచుచనినవారువిందు-కందిరప్పుడురండు॥విందు॥

7 ఘనుప్రవక్తలునువిశేష- మునేడివిందకు= పినయులైదెలియపరచిరి - వేడ్క-నరులకురండు॥వి దు॥

8 అదిసమీపమాయనంచు - అరచియోహాను పదిలముగాబోధపరచి - మునమునొందెనురండు ॥విందు॥

9 పెండ్లికుమారుండు యేసు - కీర్తితోడను- కం టియమంటబాధనొంది - కరుణజిలిచెనురండు॥విందు॥

10 యేసుశిష్యులీసువార్త- నెరుకచేసిరి-ఆసువా ర్తనస్మ- నమ్మతములచేసిరిరండు॥విందు॥

11 ఆదిమొదలుయెహోవమనల- నోదలకనిల ను= సదయతెరాయభారుల-నిదివరకిడెనురండు॥వి దు॥

12 పరమనగరలంకరించ- బడెనుబోల్చను=త గనుగానిచిద్విలాస- కరముత్తోడనురండు॥విందు॥

13 పరమనగరుద్వారములు- తెరువబడినవి= సు పతరమణితోరణములు- గార్చబడినవిరండు॥విందు॥

14 దండిప్రభునిమహిమ దెల్ప- చుండు మేళము

లు= నిండు ప్రేమపాటలువిన-నిత్యత్మేమములరండు విందు॥

15 మాతలంతయేసుప్రభుని-ప్రీతిజేయను= మాగానసంగీతములను- జేతురువిననురండు॥విందు॥

16 మానముమాతలగూడియీ- ఘనునిపాదుదము= మనసూర్తిగప్రేమ-ననుభవింతమురండు॥విందు॥

17 నిత్యజీవపదార్థములు- నిండియున్నవి= సత్యము చటమనము జేర- సర్వముగనవిరండు॥విందు॥

18 వచ్చువారలారానీతి-వస్త్రధరులుగ= వచ్చితిరాయనుభవింతురు- వాంఛదీరగరండు॥విందు॥

---

40. ౪౦.

విగ్రహారాధన వ్యర్థము.

రా. ముఖారి. తా. ఆది.

ఏలబొమ్మలనుగొల్వ నేమిలాభము-మన- మేలబొమ్మలనుగొల్వ- నేమిలాభము= చాలుబొమ్మలనుగొల్చు- చందమెరుగకమునుపు - మేలుమేలంచుకొల్చి- మేలొక్కంటెమిప్పుడు॥ఏల॥

1 జారచోరత్వములను-క్రూరకార్యంబులు వి-
చారమించుక లేక- మేరమీరిన విష్ణు - పేరిబొమ్మలను
జేసి- నారాధించుట వెర్రి॥ఏల॥

2 కామోద్రేకంబుచేత-నీమంబు దప్పిమున్ను -
భూమిని దిరిగియున్న - పామరుండైనశివుని- సామియ
ని నమ్మిగొల్వ-చాలసిగ్గైనకార్య॥మేల॥

3 వావివర్తనముదప్పి- వర్తించి లోకమందు- నే
నకర్త్రంబుగాని- చెడ్డబ్రహ్మనుజనులు- దేవుండనుటవిం
గుల- తెలివిమాలినకార్య॥మేల॥

4 సంపనూరుటకొకటి- పాడిపంటలకొకొ
కటి -బొందగుస్తునకొకటి - బిరదపడుచుటకొకటి
అందొక్క-రాయిమాల్చి- యది దేవుడని యందు॥ రేల

5 కుమ్మరివాన్నిగల్పి- కుండలధికంబు జేయ- ని
మ్మైనకుండదెచ్చి- యిడుపునందపూరబెట్టి - యన్నమా
రంచుగన్వ-లాదులో వేసిగొల్తు॥ రేల॥

6 అడవిలో చెట్టుగొట్టి- యన్ని పనిముట్లు జేసి-
నడివంకదీర్చిబొమ్మ- వడ్రంగి జేయుపిదప - దృఢమైన
రంగుబూసి- పడిపడి మ్రొక్కు-చుందు॥ రేల॥

7 లోహాదులన్నింటి - లో పాత్రాదులుజేసి

సాహసంబుననొక్క - స్వరూపమేర్పరచి - అహాహా
యనిదాని - నారాధింతురుమూఢు॥ ఏల॥

8 చచ్చినవారిపేర - మెచ్చిమోహమైనరాళ్లు - తె
చ్చిగుడిలోనబెట్టి - తెలివిలేనట్టినరులు - ఎచ్చైనపేరు
లంచు - నెగిరెగిరిమొక్కుసుకొంచు॥ ఏల॥

9 పన్నులక్కైమొకటి - నూదిమోయుటకొక
టి - కొన్నితరగతులవారి - కోతకోసంబొకటి - అన్ని
గుడిలోనొక్క - టాలబోతనికొల్తు॥ ఏల॥

10 స్నానంబువలన - జలధ్యానంబువలన - తగిన
సుదానంబువలనపాప - మానసేంద్రియశుద్ధి - యౌ
నంచునమ్మువారి - కదిమొక్క - బొమ్మగొల్చు॥ ఏల॥

11 చేతికార్యంబులంచు - ప్రీతినొందెడివార - పా
తసుండైనవాని - జేసిలిఖించుగొల్వ - పాతకంబంటు
గాని - ఫలమించుకైన లేదు॥ఏల॥

12 సృష్టికర్తనువిడి - సృష్టినారాధించి - యిష్టదై
వంబులనుచు - నిలనుగొల్చుచుగొప్ప - నష్టంబనుచుదె
లిసి - నామానరదిచోద్య॥ ఏల॥

13 వీనినారాధించు - మానవులందరు - వానితోనా
టివైన జ్ఞానహీనంబునొంది - కాననంబునగూలి - కడ
గానలేరైరి॥ఏల॥

14 దేవునికన్న ప్రియము-దేనిం దలంచబోష్ప-నే
పజేసినయట్లు-చేకూరు పాపంబు-భావశుద్ధికిమనకు
ప్రఘయేసునాథుండు॥ నేల॥

15 మా దేవుడెవ్వడంచు-ను న్నెవ్వరాలోచించ
మోదంబుతోడ మేము- మోక్షంబునందున్న -వాడది
హితంబైన-వానిజూపింతుము॥ఏల॥

16 సర్వజీవదయాళు-సంపన్నుడై యున్న -సర్వే
శ్వరుని చిత్త-సారామృతంబు గోల -నిర్వాణమునకు జే
రి-నిష్కళంకుని గొల్తు॥ మేల॥

---

41. ౪౧.

తిరునాళ్లనిష్ఫలమైనది.

రా. శుద్ధసావేరి. తా. అట.

ఏసువెన్నాతిరునాళ్లఫలము నే నేమి చెప్పుదు దు
ష్టతనము- సామి పేరట తేరుసాగించబైమూత - నేసి
యుంచకడీయ బాహురంబుగదోచె॥ నే॥

1 దానిజూచెడిగన్నులేలే- దానికన్న గుడ్డితన
ము మేలే-కాననంబుననున్న కారుమృగముల చేష్ట-బూ
ని చేసినవారుపుట్టకుండుట మేలు॥ఏ॥

2 సిగ్గుమాలిన చేష్టలంత - చేసియున్నారు తల
పోయు చింత - ఎగ్గులేదే మోవారింటనీవిధముండ - సి
గ్గుపోవునటంచు చీరగట్టుమ మొంట॥నే॥

3 చాటుచోటులు జూపినారే - వారి బోటులం
దరు జూడరారే - చేటుకోరకైనట్టి చెడ్డకోరికలన్ని
నాటు జూడ జూడ బూటకంబిదిగాద॥ప॥

4 తేరులాగను మోకు గట్టి - కోరువారలందరు
దానిబట్టి - తారుమారుగనీడ్వ తలక్రిందుగనొక్క
దుర్మారి పురుషుడు ఘోరమారణంబై పోయె॥నే॥

5 ప్రొక్కబోయిన దేవళంబు - వ్రక్కలయి
మీదబడిన చందంబు - దిక్కుమాలిన చావు పెక్కం
డ్రులో గల్గె నక్కటనాగుండెలదరిపోచున్నవి॥ప॥

6 చిత్తరువులు వ్రాసి సిగ్గు - చెరుపు వారికెప్పు
డు శిక్ష మొగ్గు - నుత్తమాధికారులూరకుండక మంచి - చి
త్తరువులు వ్రాయజేయు కాలంబెపుడో॥ప॥

7 తొంగి తేరును దేరిజూడ - దొంగవారలకిది
మంచి జాడ - బంగి మొంగి మూటలొక్కింతలో విప్పు
భంగమొందిన వారలంగలాచిక్కిరి మిగుల॥నే॥

8 నేరంబు జేసియున్నట్టి - వారు మారంబు బోయి
రెగగొట్టి - నేరమెరుగక వారి చేరువై యున్నట్టి - వా

న్నారన్న- నేరకెంచినవారలూరకుండకపోలీ-స్వాక
కప్పగించియార్తిగా జేసి॥ రే॥

16 చిల్లరప్రజలంత రేగి - చాలకల్లుసారాయాలు
ద్రావి- నొల్లుపరచినమాటలెల్లమాట్లాడుచు- కొల్ల
కొల్లగదిరిగి పెన్లాపకల పొంది॥ రే॥

17 గొప్పవారిలు గూడినారు- భోగభాగ్యలనాడిం
చినారు- చెప్పశక్యము గానితప్పభావము గల్గ--నొ
ప్పువారికి కోరికప్పగించినారు॥ ఏ॥

18 బొమ్మనయ్యంబయినజూడ - నొక్క- రిమ్మబ
ట్టినటంచునాడ-అనమ్మవేమనశతక మ్మజదనగవిన్నా-
నమ్మబుద్ధికినిశ్చయమ్మదోచినదమ్మ॥ ఏ॥

19 కాననంబునజేరినారు- దైవ జ్ఞానంబునిలగో
రువారు - కానికార్యములన్ని కన్నులారజూచి - మా
నినడచుటవింతగానున్న దదిచింత॥ ఏ॥

20 దేవసేవిదిగాదోయన్న- చెడ్డభావంబనిక మా
నకొన్నా- నేవిధంబునసర్వజీవజీవనమయిన- దేవు
నాత్మభక్తి సేవించు టెప్పుడబ్బ॥ నే॥

42. ౪౨.

## యేసునివిడిచి బ్రతుకలేము.

రా. ముఖారి. తా. ఆది.

నిన్నెడబాసియొక-నిముషంబునే బ్రతుకజాల - ని
న్న నే వేఱెకరీతి-నున్న నా యేసుప్రభువా॥నిన్నె॥

1 మున్నీటిలోఁబడి- మునుఁగనై వేఁడిన పేతు - ర
న్న శిష్యునిగాచిన- నీహస్తమునందించు ప్రభువా = ఎ
న్నతరముగా-కున్న శోధనను- మున్నీటనుబడి- నిన్ను
వేఁడితిని॥నిన్నె॥

2 నిన్ను దప్పకచూచు- చున్న సమయమునము
ణుఁగ-కున్న విశ్వాసపుగురివిడి- యున్న వానినిబోలి
యుంటి= ఎన్నడు నీమహి- మోన్నతపురమున-కన్ను
లార నే-నిన్ను జూచెదను॥నిన్నె॥

3 చిన్నరికంబునుండి - ఎన్ని యపాయముల
లో-నన్ను గాపాడినావో- సన్నుతిసన్నుతి ప్రభువా=
చిన్నకుమారుని- తెన్ను బట్టినా- కున్న జ్ఞానమును - భి
న్నము జేసితి॥నిన్నె॥

4 అన్నువగు విశ్వాసపు - చిన్నెను గద్దించి య
తని-మున్ను బలపరచినట్లు- నన్ను బలపరచవయ్య =

తిన్న నిమార్గము - లెన్ని నడచినీ సన్నిధానమున-ను
న్న టులుండెద॥నిన్నె॥

43. ౪౩.

రోగపీడితులకొరదాప్పు.

రా. ఖమాచ్. తా. అట.

ఏల యేడ్చుచున్నావు (సోదరనీవిం) కేల యేడ్చు
చున్నావు=యేలనో డ్చెదవుని-న్నేలు దేవుని ప్రేమ-
మూలనైనట్టి-నీపాలికిష్టమునో ర్వ॥ కేల॥

1 చావు బ్రతుకుల కెల్ల-సర్వశక్తుడె కర్త -యీ
విధంబున నమ్మి-యిక నాదరణనొం॥ కేల॥

2 రోగమెట్టిదియైన - రూఢినొందుము దైవ -
యోగంబు చేవచ్చె-యోచించుమిది సత్య॥ మేల॥

3 శాంతాది గుణజాల శక్తి శోధనపరద్ర-ప్తాం
ంబుకొర కేమో భ్రాంతి నొందకనుండు॥ మేల॥

4 నిత్యానందము మహిమ - నిజవిశ్వాసముని
రో-నత్యంతమగునట్టు-లంపియున్నాడేమో॥ఏల॥

5 పాపంబు జేయుని - స్పట్టిదిద్దను పశ్చా - త్తా
ంబుకొర కాప-దలుజూపినాడేమో॥ఏల॥

6 పశ్చాత్తాపమునొంది- ప్రభుయేసు నేనన్ను
నిశ్చయంబుగనోర్చి- నినురక్షించునుదయతో॥నేల॥

7 సంధుప్రేమనునిన్ను-దండించుఘన దేవు నం
డబాయకలొంగి యుండిస్తోత్రము జేయు॥ మే॥

---

44. ౪౪.

## కష్టకాల ఓదార్పు.

రా. ముఖారి. తా. జుల్వా.

జడియకుము నేసేయున్నాని - కడునెనరా మాటి
చ్చినయేసుని- అడుగుజాడలువెంబడించి- నడచుకొ
నరాదా- జీవా- హితములధికము గలిగిన ప్రభు-కిడను
జేరరాదా॥జడి॥

1 ఇష్టుడు నిన్ను బాధపరచెడి - ముప్పులందెల
బోసితప్పక- గొప్పప్రేమార్థంబపుశిక్షను నొప్పియుం
డరాదా-నీ-తప్పులన్ విడిప్రభువునందు- మెప్పుబొం
దరాదా॥జడి॥

2 ఘనముధనము సౌఖ్యంబు బోయిన్య- సనము
శోధనమున్న యోబు- మానసుదృఢము జేసి ప్రభుని- మ
హింపరచలేదా-నీ- మానసుదృఢంబటుల జేసి- మహి
మపరచరాదా॥జడి॥

3 బీదలాజరుండుభువిని- బాధనొందినసాధ్య
శంపు- బోధనసీమానసమునపాదుకొనలేదా- అత
డాదరించబడినవిధము- మోదమియ్యలేదా॥జడి॥

4 మున్ను స్త్రీపననురాళ్లతోగొట్టు-చున్నపగతు
లకొరకు దేవుని- మిన్నువైపునజూచి యోర్చి- మన్న
నడుగలేదా - నీ- కున్నశ్రమలటులోర్చ్ప్రభువు - తె
న్నుజూపలేదా॥జడి॥

5 భక్తజనులను బైదుగనీడ్చి- బాధలుగావించి
నప్పుడు- శక్తిహీనులమంచుయేసుని- శక్తినమ్మలేదా
ఆ- యుక్తసహాయముదొరకుదనుకనా- సక్తినుండలే
దా॥జడి॥

---

45. ౪౫.

## ఇంద్రియనిరసనము.

రా. కాంభోజి. తా. జంపె.

సకలేంద్రియములారా- చాలామీపనితీరె-ఇక
మీరునాజోలి - విడువవేళయ్యె= చకితమృగశా
బకముపోలిక- నకటమీచేజిక్కి-తినిమీ- రికదొలం
గుడుయేసునార- క్షకుడువచ్చెనునన్నుగావను॥సక॥

1 పంచేంద్రియములార-బలహీణగెమీకిపుడూ
వంచనసేయామీ-వశముగాదికను= మించిమీరె
దిరించలేరుద-లంచిచూడుడు దేవకృపలో-నుంచిన
నుగడలించమీకది-కొంచమగుపనిగాదు సుండీ॥సక॥

2 శ్రవణేంద్రియమానీదు - శక్తితగ్గుచువచ్చె
వివిధవార్తలదగిలి - వినుచుంటివెంతో= చెవుడునీకి
పుడనుసరించెను - చేవదరిగెనుజరిగిపొన్మిక - సవిన
యంబుగనేనుక్రీస్తుని- శబ్దమాలించెదనుసుఖమది॥స
కలేం॥

3 కనులారమీవెల్గు-క్రమముగాక్షీణించె-మ
నుజూచుచూడిక-లో-ముసుగయ్యెనికనూ= ఘనమ
గలదేవునికుమారుడు- తనకృపాసనమిపుడుజూపను
మనసులోపలికన్నువిప్పెడి - దినములివెజనుదెంచె
చూడుడు॥సకలేం॥

4 రసనేంద్రియమానీనీ - రసకాలమిదెవచ్చె
వినుకనిమాటలను - వెదచల్లినావు= పసదరిగిముడి
వైతివిపుడో- రసననూఇకదీరెనీపని - వెసనునేనిపు
డేసుకరుణా- రసముగ్రోలుచుప్రొద్దబుచ్చెద॥సక॥

5 తనువావ్యంతమమూయ-దగినత్వగింద్రియ
మా- నినుసోకునట్టివ - న్నియుగ్రహించితివి= మును

పుగలనీజిగిబిగియునణా- గెనుగదా వ్రేలాడతిత్తులు- ఉ
నుఃఖుఃవెంద్రైననేనే - సునిస్స్వరూపముదాల్చ బోయె
ద॥సక లేం॥

6 ఘ్రాణేంద్రియమానీవు కడువాసనలదగిలి
ప్రాణానిలముచేత- ప్రభలితపికను= నాణెమైనవిషి
మునుసుగంధములపొల్పడబోషపికనా- త్రాణపతి
యగుక్రీస్తుచేతను- ప్రాణసౌర్భంతునుసుఖంతును॥స
కలేం॥

7 కడుదవ్వుపయినంబు- నడిచివచ్చితినింక- న
డువలేదాత్రోవ - నికటమైవచ్చెగా= నడుమనడుమ
ననర్థపడియెడి- నిడుములన్నియుగడచిపోయెను-జ
డుతునాస్మృతినదికినారక్ష- కుడునానావికుడుగలుగగ
॥సకలేం॥

8 వెనుకతీరినమార్గ - మునకంటె ముందుండి-
కనుపించునాత్రోవ- కఠినమాయియుండు= ఘనతరం
గధ్వనులతోభీకర -మరణనదిబారుచున్నది- క్షణము
మాత్రమెదానిపనియా- వెనుకనావలిమొగ్గుజేరెద॥
సకలేం॥

9 ఈసంసారంబునం- దేమిసౌఖ్యముగలదు-ఇం
తమాత్రమెగాని - యదిచిరముగాదు= యేసుక్రీస్తు

ంతంద్రిదేవుకు - భాసురంబగునిగ్గలాన్వయు - దా
ంలకునమ నవ్వగుకృప - జేసినిత్యనివాసమిత్తువు॥
కలేం॥

---

46. ४६.

మార్గుణ జయసాధన.

రా. జంఝోటి. తా. అట.

మానసమార్పశిమోక్ష - మహిమగనిజీవించు - మూ
బునుదలంపవె - ఘనమైనశుభవార్త - నైకొన్నస
మయమున - గలుగునమ్మికబెంపవె॥మానస॥

1 శుభవార్తనైకొన్న - చోనద్దినీయాత్మ - శుద్ధి
రగదెల్పును - విభజించినీపాప - విస్తరంబునుజూపి -
యంబుపురిగొల్పును॥మానస॥

2 అటువంటిమార్పునీ - కబ్బినాయుత్తమం - బై
ార్గంబునెరిగి - పటిమతోబరలోక - భాగ్యంబు
పదువు - ప్రభుసన్నిధినిమరిగి॥మానస -

3 అంధకారముబోలు - నజ్ఞానబంధమున - నా
ంబైయుంటివి - బంధకవిమోచనం - బందుకాల
దైవ - మందింపగనుగొంటివి॥మానస॥

4 పలుమారునిను రోత-పరిచి దుఃఖాబ్ధిలో- బడ
ద్రోయజాలినట్టికలుష గుణగణములన్ - గెలుచుసా
ధనములను- దెలుపుమనువరుస బెట్టి॥మనస॥

5 నిన్నుగన్నతల్లియెడ-నీధర్మవిధమేదో-యా
ధర్మమునువిడువక- మనుటచేరాగమను-మంకుగుణ
మును గెల్తు- మాలినంబునంటబడక॥మనస॥

6 అపకారియెడలనీ- యుపశమనమునుజూపి-
యుపకారమొనరింపవే- కృపనొంద ద్వేషమును- న
పరాధమునబడకే- నుపమచేజీవింపవే॥మనస॥

7 ధనధాన్యమపరిమి-తంబుగాగూర్చుచు-దాని
పైనాశవిడకే- పెనగొనెడికామేచ్ఛ- బెరుగనీయక
నుండు-పెల్లాపదలనుబడక॥మనస॥

8 గడనచేసెడివిడి- ముడివిఘ్నపరిచెడి-చెడు
సతనమును-భ్రమింపవె- వెడలించుక్రోధమన- బడుగు
ణమునీలోన- బడకుండజీవింపవె॥మనస॥

9 తగువ్రయంబులుజేయ- దిగులొందులోభ
మున- దగిలిపోరాడబోకు- తెగద్రొక్కు-మిచ్చనీ-
దేవునిష్టముగాంచి- తెలివిలోజారిపోకు॥మనస॥

10 ధనమదాంధత్వమున-దగిలియోగ్యాయోగ్య-
తారతమ్యములెరుగక- పనులుచేసెడిమోహా- మను

గుణంబును చంపు- వినయంబు నందరుగక॥మనస॥

11 అసనమగు సంపద - లమరియున్న వినాకు- స
ముడెవ్వడని తలంచు- ఎది నేను జేయనా- కెదురు లేద
నిపొంగు- మదగుణంబును నణంచు॥మనస॥

12 తనకంటె నధికుడై - తనరియుండినవాని -
ఘనతను సహింపలేని- పనిమత్సరంబు దే- యని తెలి
సినిరతంబు- కని పెట్టుకున్న పాసి॥మనస॥

13 పరుడు దుఃఖాబ్ధిలో- బడియుండవలెనని - ప
లువిధంబుల దలంచు- నరయు మీర్ష్యంబిదే - యను
మానమింకేల- నదినిన్నె వెతలనుంచు॥మనస॥

14 నను బోలి సౌఖ్యంబు- లనుభవించుటగాడ-ద
నిపల్కు-గుణమసూయ- యెనలేని దుఃఖరా- శిని జేర్చు
నిన్నది- కనుగొనెడి తెలివిమాయ॥మనస॥

15 ఒనరించు ధర్మంబు - లనుబడుగు రెరిగినను-
ఘనుడంచు మెచ్చవలెను - అనితలంచెడి చిత్త - మది
డంబమాయనీ- విదివిడిచి బ్రతుకవలెను॥మనస॥

16 సరిలేరు నాకెవరు- పరిపూర్ణఘనుడనని-పలు
కుచున్న దిదర్పము- కరుకుమాటల చేత- పరులనందరి
జీరి- కరుచునేయిది సర్పము॥మనస॥

17 పలుకుటకుదగనట్టి- పాడుపనులను జేయ- ప
రుగెత్తుచిత్తవృత్తి- తలపనిదియిచ్ఛయని- పిలువబడు
నీలోన- నిలిచెనానీకుమిత్తి॥మనస॥

18 పలుమారు వేదంబుపఠియించివిశ్వాస-ప్రార్థ
నలుమరువ వేని- బలుపరుపదైవాత్మ-బలమిచ్చినిన్నే
సు-పక్షమునవిల్పుబూని॥మనస॥

19 శిలువమరణంబేసు- గెలిచినిన్నెలిపుంచు- బల
శాలిమైయుండగ- వెలితిపలుకేలనీ- వేగెల్తువదినిజము-
విశ్వసించుము మెండుగ॥మనస॥

---

**47.** ४८.

లోక సౌఖ్యములు నిష్ఫలములు.

రా. పున్నాగ. తా. అట.

చాలును (లోకభోగములు) చాలును= చాలు
నుమీానమునుబట్టు- గాలమైయున్న భోగములు॥చా॥

1 ఎండమావు లేనీరనుచు - మెండుగబరుగిడు
జింకరూపముండనై- బలహీనమయితి॥చా॥

2 బూరుగపండారగింప-గోరికాచికొనియున్న
ట్టి- కీరసామ్యమైతినయ్యో॥చా॥

3 దీపపుదీప్తినాశించి - యూపిరివిడుబురుగురీ
తి- బాపపుభ్రమచేనట్లయితి॥చా॥

4 పూలతోటయందుబెరుగు- బూరుగవృక్షం
బునైనే- మేలునకుమూలముగానైతి॥చా॥

5 చల్లినవిత్తనముల్లంపు-చౌటభూమివలెనేగా
గ- సత్యమునిష్ఫలమయ్యెకట॥చా॥

6 మాయసంతనైతియేసు - నాయకనన్విడక
నూర్పు- జేయుమినెనరుంచినాపై॥చా॥

7 తొల్లినర్తరప్పించినట్టి - చల్లనిసువార్తతేజ-
ముల్లమందునుండజేయు॥చా॥

8 మంచుపోల్కెనను జేయుటకై-ముంచుమీ
రక్తాంబుధిలో- బెంచుమినీవాక్సారము చే॥చా॥

9 చెడ్డబిడ్డనయ్యనేను- దొడ్డరక్షకుండవీవు-అ
డ్డిలేకనన్నుబ్రోవు॥చా॥

---

48. రం.

క్రైస్తవ దాతృత్వము.

రా. సౌరాష్ట్ర. తా. ఆది.

సంతోషముతోనిచ్చేవారి- నెంతోదేవుడుప్రే

మించుఁగ- వింతగ వలసిన దంతయు నొసగును- వినయ
మనస్సుగలవిశ్వాసులకును॥సంతో॥

1 అత్యాసక్తితో నధిక ప్రేమతో - నంధకారజను
లందరకు- సత్యసు వార్తనుచాటించుటకు-సతతము ది
రిగెడిసద్భక్తులకు॥సంతో॥

2 వేదవాక్యమును వేరు వేరుగా- మాటలనుం
డెడిబాలురకు - సాధులు ప్రభునిసు - బోధలు నేర్పెడి
సజ్జనక్రైస్తవో-పాధ్యాయులకు॥సంతో॥

3 దిక్కెవ్వరు లేకుండెడిదీనుల - తక్కువలన్ని
టిదీర్చుటకై- నిక్కపురక్షణనిద్దరలోనలు - ప్రక్కల
లో ప్రకటించుటకొరకై॥సంతో॥

4 ఇయ్యండిమీకియ్యబడునని- ఇయ్యంగలప్ర
భుయేసనెను-ఇయ్యదిమరువక నేస్థితినుండిన- నియ్యవ
లెనుమనయీవులనికను॥సంతో॥

5 భక్తిగలిగిప్రభువనికిచ్చుటబహు-యుక్తమటం
చునుదారతతో- శక్తికొలదిమనభక్తినుండియా-సక్తి
తో నిరతమునియ్యవలెఁ॥సంతో॥

---

49. ౪౯.

### విశ్వాసఫలము.

రా. యమునాకళ్యాణి. తా. ఆది.

కేనానుదేశస్త్రీవేవడి- కేక వేసెను.

1 జ్ఞానమగుప్రభుకార్యములుచెవు- లూనివిని విశ్వాసముంచి= పూనిక౯దావీదునివర-పుత్రకరుణించుమంచు॥ కే॥

2 ఎరుశలేముశాస్త్రులైన౯-ఎరుగనిమెస్సీయ బిరుదు= ఎరిగిననుకరుణించుమన్న - నేమెరుగనట్టియున్న॥ కే॥

3 నిరతముమొరలాలకించి-కరుణచేసహాయమిచ్చు= పరమధన్యుండైనయేసు-పలుకకనున్నవడిగ॥ కే॥

4 ఏలనువినలేదోయను-కూలవిశ్వాసమేదో= ఆలస్యమెందుకోయా- మూలమెరుగకనున్న॥ కే॥

5 తనకూతుఘోరబాధ-తనదిగానేభావించి= తనజీవముతోబిడ్డజీవము- పెనసినట్లుగానుండి॥ కే॥

6 కేకవేసివెంబడించు- కేనానుస్త్రీనిబోనిమ్మని = ఏకముగశిష్యాళిగూడి- యేసునివేడజూచి॥ కే॥

7 అందుకన్యలగాదుసొంత- మందనేరక్షింతు
ననగా= ఇందుకైననిరాశపడకి- ముందుకేతెంచినిలి
చి॥ కే॥

8 మ్రొక్కినసహాయంబివ్వుమన - కుక్కగా
బోల్చినవినుచు= నక్కప్రభువాఅవునటంచు- చిక్కు
పరుచుకొనె వేగ॥ కే॥

9 కుక్కలుయజమానిబల్ల - పక్కనురాలినచి
న్న= ముక్కలనుదినిబ్రతుకుగదనా - యక్కరటుదీ
ర్చుమంచు॥ కే॥

10 సొంతమాటతోడనేసు-వింతగాజిక్కె-నాస్త్రీ
కి= సంతసముతోదానిమెచ్చి- సత్ఫలంబొసగెచూ
డు॥ కే॥

11 దీనివిశ్వాసంబుమెచ్చి- దేదీప్యదృష్టాంతము
గనటు= మానితవేదాగమంబున- దీనివ్రాయించె
మెచ్చి॥ కే॥

12 రక్షకుండుమనస్థితినిప-రీక్షజేయుకాలమునప
=రీక్షకునిల్చెడివిధంపుస-లక్షణంబిదియేచూడు॥ కే॥

50. ౫౦.

## క్రైస్తవయాత్ర.

రా. బిళహరి. తా. అట.

పదరే సోదరులారా - పరమపురి జేరమధురజీవాధార- పదవి చేకూర= తుదమొదలునుయా - పదరే బగలు లేని- సదనంబునకు జేర - సదయు నేసు నిగూడి॥ పద॥

1 ఎన్ని దినములు బ్రతుక నేమి సౌఖ్యంబు- అన్ని విధముల జూడ-నధిక కష్టంబు= కన్ను మూసిననాడు మన్న పాలౌదుము-మున్ను జాగ్రతనొంద-కున్న నష్టముగల్గు॥పద॥

2 ధరణి బ్రతుకును గోర-మరణభయంబు - దరి లేని చింతల దగిలి నిత్యంబు= పరిపరి విధముల పరుగులెత్తుట లేల- నిరతంబును విశేష-సరణి గన్గొని వడిగ॥పద

3 ధనము సంపాదించి-ఘనమాధికమున్న తనవే సతముగాను - అనుభవముసున్న = వినుడు మెండ మావు- లను గోరనేపాటి- తనివి దీరును యిచ్చో- టను నాపా టేదీరు॥పద॥

4 పరలోకమార్గంబు- ఇరుకైగన్పడును- చోరగాసంకటములు- సెరిజుట్టుకొనును= పరమజనకుని కృప- వరముతోడుగనున్న- వెరపునొందమింక- సరకుసేయముపద॥పద॥

5 ఇచటనొందెడిశ్రమల- కచటనొందనవు-ప్రచురసంతోషభరమున కెన్నబడవు= అచటనొందెడి సౌఖ్యమరయశక్యముగాదు-ఇచటనస్థిరసుఖమిాక్షించకను వేగ॥పద॥

6 ఇహస్నేహములుమన- కికచాలుచాలు- బహుదినంబులు సేయ- బడెనేమి మేలు= మహిమదూతలస్నేహ- మమరునచ్చటకు- మనఅహాహాయేసుని జూడ- నధిక సంతోషంబు॥పద॥

7 మనలదోడ్కొనిపోవ - ఘనుడుయెహోవా - అనయంబుతనశుద్ధా-త్మనుయిచ్చిగావ= ఎనలేనిఅడ్డంకులనుదాటించనుకృప-గనుపర్చితోడుగ-నునిచె వేగముగూడి॥పద॥

౮ భక్తులైయున్నట్టి-బంధుమిత్రాదిర్-రక్తిగుణములతోరంజిల్లగనినర్= ముక్తిరాజ్యంబున-మురువుతోడసర్వ- శక్తునిమహిమనాసక్తితో జూతుము॥పద॥

51. ౫౧.

## పరలోకానందము.

రా. నీలాంబరి. తా. అట.

ఘనమహిమకొఱకై- కొనదినమే తెంచునట- ఘ
నమహిమతో నేసు- వినునే తెంచునట॥ఘన॥

1 వినయంపుభక్తులకువిందులట- అనయంపు
రక్షణ్యమునారు నట- కనకంపుపట్టణమునగందురట-
గానములనువినుతులను- ఘనములుగ చేతురట॥ఘన॥

2 ఆపట్టణమునననానందమట- పాపరహితాత్మ
లుబడతురట- రూపశక్యముగానిమక్కువట- చూపు
లకురూపములు- యేపుమీరిన ప్రేమట॥మన॥

3 రక్షించబడినరాజ్యస్థులట- సక్షేమమునసం
చరింతురట- మోక్షకాంతినినామోదింతురట - పక్ష
మగురక్షకుని- మోక్షమునగాంతురట॥ఘన॥

4 ధగధగయనుమకుటముదాల్తురట- యుగయు
గములు నేలుచుందురట- సొగసైనవీణలసారములట-
ముగియకనుభగవంతుని-మిగులస్తుతియింతురట॥ఘన॥

---

52. ౫౨.

### వివాహసంబంధముకనుపరుచుట.

రా. సురట్. తా. ఆది.

మంగళము- మంగళము- యేసువాజయా- మం
గళము- మంగళము=మంగళముశృంగారపు-సంఘా
ప్రియుండా ప్రియుండా శుభ॥మంగళము॥

1 సుందరంజగునట్టి-సుదతిగా సభికులను-సూ
చించినిత్యమగుసుప్రధానం= బంధురంబుగజేసి-బ్ర
తుకుపర్యంతంబు- బహుగా ప్రేమించిన-భర్తవగుయే
సూ॥మంగళము॥

2 నిత్యమైనప్రధాన- నిర్ణయమువిడిపోయే- నీ
చక్రియలయందు - నిల్వసతి= సత్యవాగ్దత్తంబు - స
ర్వాంత్తఃకరుణచే- సరవినీచేర్చిన- సామియగుక్రీస్తూ
॥మంగళము॥

3 నిన్నువిడిచిపెట్టి- నిజముపరులనుబట్టి-నింద
పాలైమరలనిన్ను జేర=కన్నతండ్రిప్రేమ-కన్నమిం
చిదాన్ని- కౌగిలించుకొనెడికర్తయగుయేసూ॥మంగ
ళము॥

4 సంఘమనెడిసతి- సకలకష్టములొంద-సర్వ

సిద్ధమైయుండు- సమయమందు= అంగదలెడబాప-
అవనికేతెంచినీ- యసువునిచ్చినయట్టి- ఆర్తబంధువు
డా॥మంగళము॥

5 అవనికేతెంచినీ - యసువునిచ్చుటవింత - అ
త్యంతప్రేమకేమాధారము= ఎవరుయెన్నిదినము -
లెంతయోచించిన యెరుగతరముగాదు - యేసునా
థుండా॥మంగళము॥

6 ఎంతవింతగుప్రేమ- దెంతయనంతంబు- ఎం
తయగాధమిదెంతశ్రేష్ఠ= మంతయింతనలేమ-మూ
ల్యమైనప్రేమ - అమలుండా - నిత్యుండా- ద్యంతరహి
తుండా॥మంగళము॥

7 నిశ్చితార్థమునకే- నిత్యసహవాస- సిర్వా
హకముమెందు- నిలిచియున్న= ఆశ్చర్యకరమైన- అ
వనంబునపెండ్లి-కందగలిగినసతికి-ఆనందమెంత॥మం
గళము॥

8 నిన్నుగూడినసతికి- నెన్నతరముగాని- అన్ని
విధముల మేలులమరియుండు= మున్నుగూడినసతికి-
ముక్తిపదవినిచ్చె - ముదతులారారండి- సదయుస
న్నిధికి॥మంగళము॥

9 సభకునీకున్నట్టి- సంబంధమిలదెల్ప- సరస

మైనపాటసలో మోసను= విభవంబుగా బాడెదనుతి
కెక్కిన పేర- విజయంబువిజయంబు-నజరేత్యేహోగా॥
మంగళము॥

10 ఇపుడుసంబంధించు-నీదంపతులదత్త-మీదే
ర్చుకృపనధిక-మిచ్చిభువిని= సఫలముగదీవించు-సం
బంధమీడకుండ-సారవంతుడనిన్ను-సన్నుతించుటకు
॥మంగళము॥

11 సర్వోన్నతంబైన-సకలంబులోనీకు-సన్నుతి
భువియందుసమ్మతింపు= సర్వజనులయందు-సరగ
కటాక్షంబు-సంపూర్ణముగాకసత్కృప చేత॥మంగ
ళము॥

## బప్తిస్మము జరుపు క్రమము.

(బప్తిస్మము పొందబొయ్యేడివారితో చెప్పవలసినది.)

మిక్కిలి ప్రియులారా! మనుష్యులందరు పాపము నందు గర్భములో ధరింపబడి పుట్టుచున్నారు. శరీరమువల్ల పుట్టునది శరీరమైయున్నది. శరీరమందుండువారు దేవుని సంతోషపరచజాలక అనేకములైన క్రియాతిక్రమములను చేయుచు పాపమునందు బ్రతుకుచున్నారు. మరియు నీళ్లవల్లను పరిశుద్ధాత్మవల్లను మల్లి పుట్టినయెడల గాని దేవుని రాజ్యములోనికి ఎవడును ప్రవేశింపలేడని మన రక్షకుడు చెప్పుచున్నాడు, గనుక ఈ మనుష్యులు స్వభావము చేత పొందలేనిదాని, దేవుడు తన గొప్ప దయవల్ల వీరికిచ్చునట్లు, అనగా వీరు నీళ్లవల్లను,పరిశుద్ధాత్మవల్లను బప్తిస్మమును పొంది క్రీస్తుయొక్క పరిశుద్ధసభలోనికి చేర్చబడి,అందులో స్వస్థావయములుగా చేయబడునట్లు, మన ప్రభువైన యేసుక్రీస్తుగుండా తండ్రియైన దేవుని ప్రార్థింపవలసినదని మిమ్మును బ్రతిమాలుకొనుచున్నాను.

---

## ప్రార్థన.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! నోవహును అతి

ని కుటుంబమును, నీళ్లలో నశించి పోకుండా నీ గొప్ప క
నికరముచేత ఓడలో కాపాడుటవల్లను ఇస్రాయేలు
కుమారులను ఎరుపు సముద్రముగుండా భద్రముగా
కొంచపోవుటవల్లను నీ పరిశుద్ధమైన బప్తిస్మమును గు
రుతుగా అగుపరిచి నీ మిక్కిలి ప్రియకుమారుడైన యే
సుక్రీస్తు యర్దేనునదియందు బప్తిస్మమును పొందినం
దువల్ల పాపమును మర్మముగా కడిగివేయుటకై మ
హాభూతమైన జలమును పరిశుద్ధము జేసితివిగదా. నీ
సేవకులు నీ కోపమునుండి విడిపింపబడి క్రీస్తు సభ అ
ను ఓడలోనికి చేర్చబడి నమ్మికయందు నెలకొనియుం
డి నిరీక్షణమువల్ల సంతోషము కలిగి ప్రీతియందు
వేరుపారి శ్రమకరమైన ఈ లోకముయొక్క అలల
ను దాటి కడకు నిత్యజీవనతీరమునందు చేరి అక్క
డ నీతోకూడా యెప్పుడును ఏలునట్లు వీరిని నీ కృ
పతో చూచి పరిశుద్ధాత్మచేత కడిగి పరిశుద్ధము చే
యుమని ప్రభువైన యేసుక్రీస్తుగుండా నీ లెక్కలేని
కనికరములకై నిన్ను బతిమాలుకొనుచున్నాము.
ఆమేన్.

## బప్తిస్మముపొందవచ్చినవారికొరకైనప్రేరేపణ.

మిక్కిలి ప్రియులారా! మీరు పరిశుద్ధమైన బప్తిస్మమును పొందవలెనని ఇక్కడికి వచ్చియున్నారు. మిమ్మును చేర్చుకొని ఆశీర్వదించుటకును, మీ పాపములలోనుండి మిమ్మును విడిపించుటకును, మీకు పరలోక రాజ్యమును, నిత్యజీవమును ఇచ్చుటకు మన ప్రభువైన యేసుక్రీస్తు అనుగ్రహింపవలసినదని ఈ సంఘము ప్రార్థించిన విధము మీరు వినియున్నారు. మరియు మేము ప్రార్థించిన వాటినిచ్చుటకు తన పరిశుద్ధవాక్యమునందు మన ప్రభువైన యేసుక్రీస్తు వాగ్దానము చేసియున్నాడు. ఆ వాగ్దానము తనపట్టునకు తాను మిక్కిలి నిశ్చయముగా కాపాడి నెరవేర్చును గనుక. క్రీస్తుచేత ఈ వాగ్దానము చేయబడినతర్వాత మీరుకూడా దూషకుని వాని క్రియలనన్నిటిని విడిచిపెట్టి దేవుని పరిశుద్ధవాక్యమును స్థిరముగా నమ్మి ఆయన ఆజ్ఞలను విధేయతగా కాపాడుదుమని మీ పట్టునకు మీరును ఈ మీ సాక్షులమెదుటను సంఘముమెదుటను వాగ్దానము నమ్మకముగా చేయవలసినది.

## వాగ్దానము చేయించుట.

---

పిశాచిసంబంధమైన క్రియలను పనికిమాలిన లోకడంబములను దురాశలను అనుసరింపక వాటిప్రేరేపణలకు లోబడక నడుచుకొంటావా?

(విశ్వాసప్రమాణమును ప్రశ్నార్థకముగా నడుగవలసినది.)

ఈ మతమునందు బప్తిస్మమును పొందగోరుచున్నావా?

అయితే దేవుని పరిశుద్ధచిత్తమును ఆజ్ఞలను విధేయతగా కాపాడి వాటిలోనే నీవు బ్రతికే అన్నిదినములును నడుచుకొనగోరుచున్నావా?

---

(పిల్లలబప్తిస్మమందు తలిదండ్రులనడుగవలసినది.)

---

మీ పిల్లలకొరకు దేవుని సహాయమువల్ల యుక్తముగా నడుచుకొంటారా?

మీ పిల్లలకు తెలివి వచ్చినప్పుడు మీరు ఒప్పుకొన్నప్రకారము నేర్పిస్తారా?

ప్రతిదినము మీ నడతవల్ల మీ మాటవల్ల దేవుని వాక్యమును బోధిస్తారా?

మీతో మీ పిల్లలను చేర్చుకొని తగిన కాలములో ప్రార్థిస్తారా?

---

## ప్రార్థన.

కరుణగల దేవా! ఈ మనుష్యులలోనుండు పాత ఆదాము పూడ్చబడి వీరిలో క్రొత్త పురుషుడు లేచునట్లు అనుగ్రహించుము. ఆమేన్.

వీరిలో శరీరసంబంధమైన అభిమానములన్నియు చచ్చి ఆత్మసంబంధమైన సమస్తమును బ్రతికి వృద్ధి పొందునట్లు అనుగ్రహించుము. ఆమేన్.

వీరు సైతానును, లోకమును, శరీరమును జయించి వాటిని బొత్తిగా రోసి వేయునట్లు సామర్థ్యము, బలమును కలిగియుండుటకు అనుగ్రహించుము. ఆమేన్.

పితృ పుత్ర శుద్ధాత్మ నామమున నీకు బప్తిస్మము నిచ్చుచున్నాను. ఆమేన్.

## ప్రార్థన.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! పరలోకపు తండ్రీ! నీ కృపను తెలిసికొనుటకును నిన్ను నమ్ముటకును మమ్మును దయతో పిలిచినందుకు నీకు వినయముగల కృతజ్ఞ

తాస్తుతులను చెల్లించుచున్నాము. ఎల్లప్పుడును మాలో ఈ తెలివిని వృద్ధి చేసి యీ నమ్మకము బలపరుచుము. తిరిగి పుట్టి మా ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా నిత్యరక్షణకు బాధ్యుడుగా (బాధ్యురాలుగా) చేయబడిన ఈ బిడ్డ (మనిషి) నీ సేవకుడుగా (నీ సేవకురాలుగా) నిలిచి యుండి నీ వాగ్దత్తమును పొందేటట్టు నీ పరిశుద్ధాత్మనిమ్మని నీతోను పరిశుద్ధాత్మతోను ఇప్పుడును ఎప్పుడును బ్రతికి ఏలే నీ కుమారుడును మా ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్.

---

నిర్ధారణక్రమము.

ఈ మీ తలిదండ్రులు బప్తిస్మమందు మీ పేరట చేసిన గంభీరమైన వాగ్దత్తమును ప్రతిజ్ఞను ఇక్కడ దేవుని సముఖములోను ఈ సంఘము యెదుటను తిరిగి చేసి మీయంతట మీరే వాటిని సరియని స్థిరపరిచి మీకు ప్రతిగా వారు అప్పుడు పూనుకొన్నవన్నియు నమ్మి నెరవేర్చుటకు బద్ధులమై యున్నామని ఒప్పుకొనుచున్నారా?

ఉత్తరము. ఒప్పుకొనుచున్నాను.

---

## విశ్వాసప్రమాణప్రశ్నలు.

పరలోక భూలోకములకు సృష్టికర్తయగు సర్వ శక్తిగల తండ్రియైన దేవుని నమ్ముచున్నావా?

ఆయన ఏకకుమారుడును, మన ప్రభువునైన యేసుక్రీస్తును నమ్ముచున్నావా? ఆయన పరిశుద్ధాత్మవల్ల కన్యయైన మరియగర్భమందు ధరింపబడి ఆమెకు పుట్టెననియు పొంతిపిలాతుకాలమందు బాధను పొంది శిలువవేయబడి చనిపోయి పాతిపెట్టబడెననియు అదృశ్యలోకములోకి దిగి మూడవనాడు తిరిగి లేచెననియు ఆకాశమునకెక్కి సర్వశక్తిగల తండ్రియైన దేవుని కుడిచేతివైపున కూర్చుండియున్నాడనియు అక్కడనుండి బ్రతికియుండువారిని చనిపోయినవారిని విమర్శించుటకు లోకాంతమున వచ్చుననియు నమ్ముచున్నావా?

పరిశుద్ధాత్మను నమ్ముచున్నావా? పరిశుద్ధ క్రైస్తవ సభను పరిశుద్ధులతో కూడియుండుటను పాపక్షమాపణను ప్రాణముతో తిరిగి లేచుటను మరణముతరువాత నిత్యజీవమును నమ్ముచున్నావా?

అడగబడినవారు వీటినన్నిటిని రూఢిగా నమ్ముచున్నానని చెప్పవలెను.

---

ప్రార్థించుదము.

సదా జీవించుచుండు సర్వశక్తిగల దేవా! నీటివల్లను పరిశుద్ధాత్మవల్లను ఈ నీ సేవకులను తిరిగి పుట్టించి వీరి పాపము లన్నిటినిక్షమించనను గ్రహించినావు. ఓ ప్రభువా! ఆదరణకర్తయైన పరిశుద్ధాత్మవల్ల వీరిని బలపరుచుము. నీ నానావిధములైన కృపావరములను, అనగా జ్ఞాన వివేకములుగల యాత్మను ఆలోచన మనోబలములుగల యాత్మను తెలివియు భక్తియుగల యాత్మనును వీరిలో దినదినము వృద్ధిచేయుము. ఓ ప్రభువా! ఇప్పుడును ఎప్పుడును నీ పరిశుద్ధభయముగల యాత్మతో వీరిని నింపుమని బ్రతిమాలుకొనుచున్నాము. ఆమేన్.

ఓ ప్రభువా! ఈ నీ పిల్ల(లేదా యీ నీ సేవకుడు) ఎప్పుడును నీ వాడై (లేక నీదై) యుండి నీ నిత్య రాజ్యమునకు వచ్చేవరకు నీ పరిశుద్ధాత్మయందు దినదినమును అంతకంతకు వృద్ధి పొందునట్లు దీనిని (లేక యితనిని) నీ దివ్యకృపతో కాపాడుము. ఆమేన్.

తండ్రి కుమారుడు పరిశుద్ధాత్మయునైన సర్వశ
క్తిగల దేవుని దీవెన మీకు కలిగి యెప్పుడును మీ
కుతోడై యుండునుగాక. ఆమేన్.

---

## ప్రభుభోజనము జరుపు క్రమము.

---

ప్రభువునందు మిక్కిలీ ప్రియులైన వారలారా! మన రక్షకుడైన క్రీస్తు శరీరరక్తముల పరిశుద్ధ సహభాక్త్వమునకు రావలయునని మనస్సు కలిగిన మీరు ఈ రొట్టెను ఏమాత్రమైనను తినుటకును ఈ పాత్రయందు ఏమాత్రమైనను తాగుటకును తెగింపక మునుపు తమ్మును తాము జాగ్రతగా తరచి పార చూచుకొనవలెనని పరిశుద్ధుడైన పౌలు అందరిని ఏలాగున హెచ్చరించుచున్నాడో మీరాలోచింపవలయును. ఏమనగ మనము నిజమైన పశ్చాత్తాపపు హృదయముతోను జీవార్థవిశ్వాసముతోను పరిశుద్ధమైన సంస్కారము పొందినట్టయిన ప్రయోజనము గొప్పదైయుండును. దానిని మనము అయోగ్యముగా పొందినట్టయిన మోసమును గొప్పదియైయుండును. ఎందుకనగ మన రక్షకుడైన క్రీస్తు శరీరరక్తము

లనుగురించి అపరాధులమగుదుము. మరియు ప్రభువుయొక్క దేహమును ఆలోచింపక మనకు మనమే శిక్షావిధి అగునట్లు తిని త్రాగుదుము. మనకు విరోధముగా దేవుని కోపమును రేపుదుము, గనుక మీరు ప్రభువువల్ల విమర్శింపబడకుండా మిమ్మును మీరే విమర్శించుకొని గత పాపములకై వాస్తవముగా పశ్చాత్తాపబడి మన రక్షకుడైన క్రీస్తునందు స్థిరమైన విశ్వాసముంచి అందరితో పూర్ణస్నేహము కలిగి యుండుడి.

---

## ప్రభు భోజనము పొందనైనవారిని ప్రేరేపించుట.

---

మీ పాపములకై వాస్తవముగాను పట్టుదలతోను పశ్చాత్తాపపడి మీ పొరుగువారియెడల ప్రేమయును స్నేహమును కలిగి దేవుని ఆజ్ఞలను అనుసరించి ఆయన పరిశుద్ధ మార్గమునందు నడుచుకొని క్రొత్త నడతను సాగించ మనస్సు కలిగిన మీరు విశ్వాసముతో దగ్గరకువచ్చి మీ యాదరణమునకై సంస్కారమును పుచ్చుకొనుడి. సిద్ధపడుటకు మో

కాళ్లూని సర్వశక్తిగల దేవుని యెదుట మీ పాపము
లను వినయముతో నొప్పుకొనుడి.

---

ప్రభు భోజనము పొందు మనస్సు గలవారు వినయ
ముతో మోకాళ్లూని చెప్పవలసిన పాపముల ఒప్పు
కోలు.

సర్వశక్తిగలదేవా! మా ప్రభువైన యేసుక్రీస్తు
తండ్రీ! సమస్తమును సృష్టించినవాడా! జనులంద
రికి న్యాయాధిపతీ! మా మీద నీ కోపమును రేపుకొ
నుచు నీ దివ్య ఘనమునకు విరోధముగా తలంపులతో
ను మాటలతోను క్రియలతోను అడుగడుగునకు బహు
ఘోరముగా చేసిన మా నానావిధ పాపములను ఒ
ప్పుకొని పట్టుదలగా పశ్చాత్తాపబడి నిండు మనస్సు
తో దుఃఖించుచున్నాము. వాటి జ్ఞాపకము మాకు
బాధకరముగా నున్నది. వాటిమోపు తాళగూడని
దిగా నున్నది. మిక్కిలి కనికరముగల తండ్రీ! మ
మ్మును కనికరించుము. నీ కుమారుడును మా ప్రభ
వునైన యేసుక్రీస్తు నిమిత్తము జరిగినదంతయు క్ష
మించుము. నీ పేరునకు గొప్పయు మహిమయు క
లుగునట్లు మేమిక క్రొత్తనడత గలవారమై యెల్లప్పు

డును నిన్ను సేవించి సంతోష పరుచులాగున మా ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా అనుగ్రహించుము. ఆమేన్.

---

## ప్రార్థన.

ఓ కనికరముగల ప్రభువా! మేము నానావిధములైన నీ గొప్ప కనికరములను విడిచి మా స్వనీతిని నమ్ముకొని ఈ నీ భోజనమునకు రా తెగించలేము. రాలియున్న ముక్కలు ఏరుకొనునంత యోగ్యత గలవారము కాము గాని నీవు ఒక్కటే స్వభావముగల ప్రభుడవు, ఎల్లప్పుడు కనికరించుట నీ లక్షణమైయున్నది. కాబట్టి కృపగల ప్రభువా! మా పాప శరీరములు నీ ప్రియ కుమారుడైన యేసుక్రీస్తు శరీరమువల్ల శుద్ధి చేయబడునట్లును మా యాత్మలు ఆయన మిక్కిలి విలువగల రక్తముచేత కడగబడునట్లును మేము ఆయనలోను ఆయన మాలోను ఎప్పుడు నివసించునట్లు, ఆయన శరీరము తినుటకును, ఆయన రక్తము తాగుటకును మాకు అనుగ్రహించుము. ఆమేన్.

---

## సంస్కారప్రతిష్ఠ.

క్రీస్తు అప్పగించబడిన రాత్రియందు రొట్టెను తీసికొని స్తోత్రముచేసి దానిని విరిచి తన శిష్యులకిచ్చి, తీసికొని తినుడి, ఇది మీ కొరకియ్యబడుచున్న నా శరీరమై యున్నది. నన్ను స్మరించుటకై ఇది చేయుడని చెప్పెను. ఆప్రకారమే భోజనమైన పిమ్మట ఆయన గిన్నె తీసుకొని స్తోత్రముచేసి దాని వారికిచ్చి, దీనిలోనిది మీరందరు త్రాగుడి, ఇది పాప పరిహారమునకై మీకొరకును అనేకుల కొరకును ధారపోయబడుచున్న నా నూతన నిబంధన రక్తమై యున్నదేను. ఇది మీరు త్రాగినప్పుడెల్ల నన్ను స్మరించుటకై చేయుడని చెప్పెను. ఆమేన్.

---

## రొట్టెను పంచునప్పుడు పలుకవలసినది.

నీ కొరకియ్యబడిన మనప్రభువైన యేసుక్రీస్తు శరీరము నీ శరీరమును ఆత్మను నిత్యజీవమునకై సంరక్షించునుగాక. క్రీస్తు నీ కొరకు చనిపోయినాడను జ్ఞాపకముతో దీనిని తీసికొని తిని నీ హృదయమందు విశ్వాసముచేత కృతజ్ఞస్తుతితో ఆయనను ఆహారముగా చేసికొనుము.

## గిన్నె ఇచ్చేటప్పుడు పలుకవలసినది.

నీ కొరకు ధారపోయబడిన మన ప్రభువైన యేసు క్రీస్తు రక్తము నీ శరీరమును ఆత్మను నిత్యజీవమునకై సంరక్షించునుగాక. క్రీస్తు రక్తము నీ కొరకు ధారపోయబడినదను జ్ఞాపకముతో ఇది త్రాగి కృతజ్ఞత కలిగియుండుము.

పిమ్మట ప్రభు ప్రార్థన లేక ఇతర ప్రార్థన చేయవచ్చును.

---

## వివాహము యొక్క అనుష్ఠాపన క్రమము.

మిక్కిలి ప్రియులారా! ఈ స్త్రీ పురుషులకు పరిశుద్ధ వివాహము చేయుటకు మనము దేవుని సన్నిధిమందును ఈ సంఘము యెదుటను కూడియున్నాము. వివాహము మనుష్యుడు నిర్దోషియై యున్నప్పుడు దేవుడు నియమించిన ఘనమైన స్థితి అయ్యుండి, క్రీస్తుకును ఆయన సభకునుగల మర్మపు ఐక్యమును సూచించుచున్నది. గలలియా యందుండు కానాలో వివాహము జరిగినప్పుడు క్రీస్తు అక్కడికి వెళ్లి యుండుటవల్లను, చేసిన మొదటి అద్భుత క్రియవల్లను, ఆ పరిశుద్ధ స్థితిని అలంకరించెను.

మరియు పరిశుద్ధుడైన పౌలు, ఇది అందరు ఘనము గా ఎంచతగినదని మెచ్చుకొన్నాడు. కాబట్టి యెవ రును తెలివిలేని పశువులవలె శరీరేచ్ఛలను, కోరిక లను తృప్తి పఱచుకొనుటకై దీనిని ఆలోచనలేకుం డగాను, చులకనగాను, కామాతురముగాను, పూ నుకొనకూడదు. అయితే వివాహము ఏర్పడిన హే తువులను తగినట్టుగా యోచించి, ఆలోచన వినయ వివేక సుబుద్ధులతో దేవునికి భయపడి, దీనిని పూనుకొనవలెను. ఆ హేతువులేవనగా:

1 మనుష్యాభివృద్ధికిని దేవుని పరిశుద్ధనామము నకు స్తోత్రము కలుగుటకును వివాహము ఏర్పడియు న్నది.

2 ఇంద్రియ నిగ్రహము లేనివారు వివాహము చేసికొని, క్రీస్తుశరీరమందు నిష్కళంకమైన అవయ వములుగా తమ్మును కాపాడుకొనుటకు జారత్వము చేయకుండ, ఆ పాపమునకు అది విరుగుడుగా ఏర్ప డి యున్నది.

3 సుఖ దుఃఖములలో ఒకరికి ఒకరు తోడుగా ను సహాయముగాను ఆదరణగాను ఉండునట్లు, ఇ ది ఏర్పడి యున్నది.

ఇక్కడనున్న వీరిద్దరు ఈ పరిశుద్ధ స్థితిలో చేర్చబడుటకు వచ్చియున్నారు. కాబట్టి వీరు యథావిధిగా జతపరచబడకూడదని ఏవైనా తగిన హేతువు తెలియచేయ గలిగినట్టయిన ఇప్పుడే తెలియచేయవలెను; లేదా ఇకమీదట యెప్పటికిని ఊరుకొనవలెను.

మరియు వివాహము చేసుకొనువారిని చూచి చెప్పవలెను.

దేవుని మాటప్రకారము కాక, మరియొక విధముగా జతపరచబడు వారందరు దేవునిచేత జతపరచబడరనియు, వారి వివాహము యథావిధిగా ఉండదనియు మీరు బాగుగా రూఢిపరుచుకొనవలెను. కాబట్టి హృదయ రహస్యములన్నియు బైటపడు భయంకరమైన విమర్శ దినమందు, మీరుభయులు ఉత్తరము ఇయ్యవలెను. గనుక మీరు యథావిధిగా వివాహమువల్ల జతపర్చబడకూడదని మీలో ఎవరైనను ఆటంకమేమైనను తెలిసికొని యుండినను, దానిని ఇప్పుడు ఒప్పుకొనవలెనని గట్టిగా ఆజ్ఞాపించుచున్నాము.

దేశికుడు చెప్పవలసినది.

దేవుని నిర్ణయము చొప్పున పరిశుద్ధ వివాహస్థితిలో కూడియుండుటకు, ఈ స్త్రీని నీ పెండ్లిభార్యనుగా చేసికొందువా? ఈమెను ప్రేమించి, ఆదరించి, ఘనపరిచి, వ్యాధియందును ఆరోగ్యమందును ఈమెను కాపాడి ఇతరులనొల్లక మీ జీవిత కాలమంతయు ఈమె భర్తవై యుందువా?

పురుషుడు ఇయ్యవలసిన ఉత్తరము. ఉందును.

అప్పుడు గురువు స్త్రీతో చెప్పవలసినది.

దేవుని నిర్ణయము చొప్పున పరిశుద్ధ వివాహస్థితిలో కూడియుండుటకు, ఈ పురుషుని పెండ్లి భర్తనుగా చేసికొందువా? ఇతనికి లోబడి, ఉపచారముచేసి, ఇతని ప్రేమించి, ఘనపరిచి, వ్యాధియందును ఆరోగ్యమందును ఇతనిని కాపాడి, ఇతరులనొల్లక, మీ జీవితకాలమంతయు ఇతనికే భార్యవై యుందువా?

స్త్రీ ఇయ్యవలసిన ఉత్తరము. ఉందును.

అప్పుడు సేవకుడు చెప్పవలసినది.

వివాహము చేసికొనుటకు, ఈ స్త్రీని ఈ పురుషునకు ఇచ్చువారెవరు?

అంతట వివాహము చేసికొనెడివారు ఒకరితో నొకరు ఈదిగువ వచ్చెడి క్రమము చొప్పున ప్రమాణము చేయవలెను.

సేవకుడు. స్త్రీని, ఆమె తండ్రిచేతగాని, స్నేహితుని చేతగాని, గ్రహించి పురుషుని కుడిచేతితో, స్త్రీ కుడిచేతిని పట్టించి తనవెంటనే చెప్పించవలసినది ఏమనగ:

అనే నేను            అనే నిన్ను ఇది మొదలుకొని చావు మనలను ఎడబాపువరకు దేవుని పరిశుద్ధ నిర్ణయముచొప్పున మేలు కీడుల యందును, కలిమి లేములయందును, రోగారోగ్యములయందును నిన్ను ప్రేమించి, సంరక్షించుటకై నా పెండ్లిభార్యనుగా చేసికొనుచున్నాను. ఈ చొప్పున జరిగింతునని ప్రమాణము చేయుచున్నాను.

వారు తమచేతులు విడిచిపెట్టిన తరువాత, స్త్రీ

యును తన కుడిచేతితో పురుషుని కుడిచేతిని పట్టు
కొని సేవకుని వెంట చెప్పవలసినది ఏమనగ.

అనే నేను అనే నిన్ను

ఇది మొదలుకొని చావు మనలను ఎడబాపు వరకు దేవుని పరిశుద్ధ నిర్ణయము చొప్పున మేలు కీడుల యందును, కలిమి లేముల యందును, రోగారోగ్యముల యందును, నిన్ను ప్రేమించి, సంరక్షించి నీకు లోబడి యుండుటకు నా పెండ్లిభర్తనుగా చేసికొనుచున్నాను. ఈచొప్పున జరిగింతునని ప్రమాణము చేయుచున్నాను.

ఈ ఉంగరముతో (లేదా ఈ మంగళ సూత్రముతో) నిన్ను వివాహము చేసికొని, నా శరీరముతో నిన్ను ఘనపరిచి, నా ఆస్తికి భాగస్థురాలినిగా చేసికొనుచున్నాను. దీనిని తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయునైన దేవుని పేరట చేయుచున్నాను. ఆమేన్.

అంతట పురుషుడు, స్త్రీ యెడమచేతి ఉంగరపు వేలున ఉంగరము ఉండనిచ్చి ఉభయులును మోకాళ్లూని యుండగా సేవకుడు చెప్పవలెను.

## ప్రార్థించుదము.

మనుష్యు లందరికి సృష్టికర్తవును, పాలకుడవునైన ఓ నిత్యదేవా! ఆత్మీయమైన సమస్త కృపా వరములను దాతా! నిత్యజీవమునకు కారకుడా! ఇస్సాకును, రిబక్కాయును నన్మాకముగా కలిసి కాలము గడిపినట్లు, ఈ ఉంగరమును (లేక ఈ మంగళ సూత్రమును) ఆనవాలుగా ఇచ్చి పుచ్చుకొని, ఒకరికొకరు చేసికొనిన ప్రతిజ్ఞను ఒడంబడికను రూఢిగా నెరవేర్చి, సంపూర్ణ ప్రేమతోను, సమాధానముతోను ఎప్పుడును కూడియుండి, నీ ఆజ్ఞ ప్రకారము నడుచుకొనునట్లు మా ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా వీరిని ఆశీర్వదించుము. ఆమేన్.

తరువాత గురువు వారి కుడిచేతులను
కలిపి చెప్పవలెను.

దేవుడు జతపరచిన వారిని ఎవ్వరును
ఎడబాప కూడదు.

అంతట సేవకుడు జనులనుచూచి చెప్పవలెను.

 న్ను  న్ను పరిశుద్ధవివాహమునకు సమ్మతించి ఆసంగతి, దేవుని సమ్ముఖ

ముందును, ఈ సంఘముయెదుటను ప్రచురపరిచి, ఒ
కరికి ఒకరు ప్రమాణముచేసి ఒక ఉంగరము పెట్టు
టవలనను (లేక మంగళసూత్రము కట్టుటవలనను,)
చేతులు కలుపుటవలనను, దానిని తెలిపినారుగనుక,
వీరు భార్యా భర్తలని పితృ పుత్ర శుద్ధాత్మ యయి
న దేవుని పేరట ప్రకటించుచున్నాను. ఆమేన్.

అంతట సేవకుడు, దిగువనువచ్చెడి ఆ
ర్వచనము పలుకవలెను.

పితృ పుత్ర శుద్ధాత్మ యయిన దేవుడు మిమ్మును
ఆశీర్వదించి, సంరక్షించి, కాపాడునుగాక. ప్రభు
వు మిమ్మును కటాక్షించి పరమందు మీరు నిత్యజీ
వము పొందుటకై ఇహమందు అనుకూలముగా కా
లము గడుపులాగున ఆత్మీయమైన ప్రతి దీవెనతోను,
కృపతోనుమిమ్మును నింపునుగాక. ఆమేన్.

---

53. ౫౩.

భార్యాభర్తల ధర్మములు.

రా. శంకరాభరణం. తా. అట.

విన్నారావివాహబంధ- మున్నదిమరణముచేగా

క- కెన్న జెడబాపునొందుటలేము (ఓ సోదరసోదరి)
చెన్నుగానీబోధాలించండి॥వి॥

1 తననువిశ్వసించియున్న- మనుజులకాపాడ
నేను - తనవుబలిగానొసగిప్రేమించె ( ఓ నాప్రియ
సోదరయీ ) వనితనావిధముగాప్రేమించు॥వి॥

2 మీరేకశరీరమైయున్నా రటంచుబల్కు- వే
ద - సారమెరగిసతినిప్రేమించు (ఓ నాప్రియ సోదరు
డా) మేరమీారకుండజీవించు॥వి॥

3 నీకన్ననీసతితక్కు- వను - లోకరీతినణచిమీా
ర- లేకరీతిగానన్నిటియందు (ఓనాప్రియసోదరుడా)
లోకమందుమానుటధర్మంబు॥వి॥

4 ఎన్నడైనస్వశరీరమును- భిన్నంబుగనెంచ
లేక - నున్నయట్లుభార్యనుదలంచి (ఓ నాప్రియసో
దరుడా) మన్ననమర్యాదలనుబెంచు॥వి॥

5 బలహీనురాలంచునెరిగి- కలహించుటతగ
దుప్రార్థ- నలకునభ్యంతరములేనటుల (ఓ నాప్రియ
సోదరుడా) చెలిమితోజ్ఞానముతోనివసించు॥వి॥

6 పాలివారలై త్రిరిక్కృపా - వరంబునందుమీా
రు-తూలనాడకదుర్బలస్త్రీని(ఓ నాప్రియసోదరుడా)
మెలగుసన్మానించుమెపుడు॥వి॥

7 అనయముసంఘంబేసుప్రభునకులోబడిన
డచినట్లు- పెనిమిటికిలోబడవలయునంచు (ఓ నాప్రి
యసోదరీ) ఘనమగువేదంబుబోధించు॥ప॥

8 అన్నిటలోబడినదానవగుట- నీ పెనిమిటి
యందు-చెన్నగుభయభక్తిసమకూర్చు (ఓ నాప్రియ
సోదరీ) ఎన్నడైనపగసాధించకుము॥ప॥

9 సిరసైయేసుప్రభువుసభకు- మెరయుచునున్నా
రీతినినీ సిరసైయున్న పెనిమిటికిలొంగి (ఓ నా ప్రియ
సోదరీ) తిరుగునీ దేహసంరక్షకుడు॥ప॥

10 శక్తిహీనులైవాక్యమునా - సక్తిగాచేకొనకను
న్న-భక్తియుతమౌనిర్మలవర్తనచే (ఓ నాప్రియసోద
రీ) భర్తనురాబట్టుకొనవచ్చు॥ప॥

11 వెలుపటియలంకారముగా-వలయుననుటకా
దుగాని- విలువగలశాంతాదిగుణములతో (ఓ నాప్రి
యసోదరీ) మెలుగుటయాత్మాలంకారంబు॥ప॥

12 దేవునియందెమరుజూచిన- దివ్యమైనస్త్రీలు
మున్ను-యేవిధముగావర్తించినారో (ఓ నాప్రియసో
దరీ) ఆవిధముగావర్తించుమెపుడు॥ప॥

13 శారాబ్రహామునుప్రభువని- నోరారబిలిచిలో
బడినట్లు కూరిమినినీ పెనిమిటినిగూడ (ఓ నాప్రియసో

దరీ) ఆరీతినిసన్మానించిపిలుము॥వి॥

14 బలువైననీహేతువులచే- తలిదండ్రిడినైనావిడ వచ్చు- కలనుమీకలియుటవిడరాదు (ఓసోదరసోద రీ) నిలుపుడీబోధమీమదియందు॥వి॥

---

54. ౫౪.

## భార్యా భర్తల ఒప్పుదల.

రా. శంకరాభరణం. తా. చాప్.

దైవాజ్ఞరీతిపరిశుద్ధంపు- వివాహస్థితిని- ఈపనిత నునీభార్యనుగా- నొప్పిసమ్మతించెదవాఓసోదరా॥

1 ఔను-సత్యంబుజేతు - నరమరలేమనమ్మండ వని - పైబ్రతుకుదినములన్నిట - దేవునికిజడిసి పూనొ్కొందుఁ॥

2 వ్యాధినినారోగ్యమునన- భేదమైనప్రేమనుంచి- యాదరించిఘనపరిచినీవన్నిట- కాపాడెదవాఓ సోదరా॥

3 బ్రతికెడికాలంబునందు- వెతుకకనన్యస్త్రీనెపుడు- సతికొరకునినునీవెబహుజా- గ్రతనుబొందికాపాడుదువాఓసోదరా॥

---

55. ౫౫.

## మంగళార్చన.

రా. భైరవి. తా. రూపకము.

మంగళము క్రీస్తునకు-మహితశుభ వార్తునకు మంగళము త్రిత్వ-సమాన్వితునకు - మంగళము దూతజన-మగుటమగు ప్రభువునకు- మంగళము వేదాంత- మాన్యతునకు- జయమంగళము- సదాశుభమంగళము॥

1 పరమజనక కుమార - దురితతతిసంహార- నిరత మోక్షానంద-పురవిహార - వరభక్త భయదూర- కరుణామృతాసార - నరరూపధార - మరియకుమారా॥జయమంగళము॥

2 కానానుజను దెంచి-కళ్యాణమును మహీమ-గానొనర్చు నీరు-గాంచి ద్రాక్షా-పానముగ మార్చి నీ- ప్రథమాద్భుత ప్రతిష్ఠ- భూనుతుడ దెల్పితివి మానితముగ॥జయమంగళము॥

3 నీకు సంఘమునను - నిత్యమైన వివాహ- పేకత్వమునకుదగు- నెచ్చరికగా- గైకొనెడి నీ సేవ-కవరుల సంబంధ- మీకలియుగంబున - నిముడుగాక॥జయమంగళము॥

4 ప్రేమానుబంధమున- బెనగియీదంపతులు-
వేమారునీకుహితము- వెదికిభువిని- కామాదులనుగెల్చి-
కైవల్యపురమునకు- క్షేమముగకృపనిచ్చి- చేరనిమ్ము॥
జయమంగళము॥

5 ఆదరణకోరకాంబ్రి- హామునకుశారాక- నా
దియగుసుదయ- నర్పిన్నట్టు- ఈదీనదంపతులు-గా
దిలిచేబ్రతుకుటకు- నాదయారసమొసగు- నక్షయుం
డా॥జయమంగళము॥

6 చారుతరచరితుడా- కూరిమిభరితుడా- వా
రకిలపతిపత్ని- గోరునట్లు- భూరిసంతానంబు - వీరికి
నొసంగుమని- పేరోలగంబిచట- జేరితిమయా॥జయ
మంగళము॥

7 సంతానమునుగాంచి- సద్వృత్తిలో బుద్ధి-
మంతులై క్రైస్తవ- మతమునందు - అంత్యపర్యంతం
బుఅణకువగబెంచనా - ద్యంతరహితుండస- హాయ
మిమ్ము॥జయమంగళము॥

8 భక్తజనస్తోత్రమా- ముక్తికిసుమార్గమా- యు
క్తయీవులుసుప్ర- యోగమునకు-రక్తిగావిజ్ఞప్తి-సం
జిల్లజేయునీ- శక్తిహీనులయా- సక్తిదీర్చు॥జయమంగ
ళము॥

9 కర్తయైనక్రీస్తు- కరుణయు దేవుని- పరమపూర్ణప్రేమ- ప్రజలముగను- సురుచిరంబగుపరి- శుద్ధాత్మయైక్యత - కలుగుగాక దంప- తులకనిశము॥జయమంగళము॥

---

56 × ౬

## ఆశీర్వాదము.

ప్రభుమార్గములయందు భయభక్తినిందు- శుభరీతినడిచేపురుషుండే ధన్యుండు॥

1 అపుడునీచేకష్టంబారగించుదువు-ఎపుడుధన్యుడవు నీకిల మేలౌగాక॥

2 నెలవుప్రక్కలనున్న సఫలమౌద్రాక్షతీ-గెలపోలినీభార్య ఫలమిచ్చునుగాక॥

3 పిల్లలిప్పమొక్క- పెంపువలెనీదు- బల్లజుట్టుకొనిశోభిల్లుదురుగాక॥

4 ప్రభువునకిదిగో భీతిపడువాడీరీతి-విభవంపుదయనొందివికసించునుగాక॥

5 ప్రభువుశియోనులోనుండి ప్రశస్తానుగ్రహము- ప్రబలంబుగానిచ్చి బ్రతికించునుగాక॥

6 అరయుబ్రతికెడిరోజులన్నిటనీవు- యెరుష
లేముక్షేమంబునెపుడుజూచెదవు॥

7 నీదుపిల్లలపిల్లలునిజమిస్రాయేలు- మీఁదిక్షే
మముజూచిమోదమొందెదవు॥

8 తండ్రికుమారుశుద్ధాత్మునకు మహిమ- మెం
తైయుగయుగమునందుండుగాకామేన్॥

---

57. ×2.

దీవెనకీర్తన.

రా. రేగుప్తి. తా. రూపకం.

దీవెనతోశలవిమ్ముకర్తా- మాకుమా- దీవెనతో
శలవిమ్ముకర్తా॥

దీవించిక్షేమంపు- శీవులనుదయచేసి - జీవపోష
ణవార్త- భావమునసమకూర్చి॥దీవె॥

1 లోకమునవిన్ను వేడుకొని- మేముయా-లో
కమునకొనియాడుకొని= శ్రీకరంబగుదివ్య- లోకం
బులోజేరి- యేకముగస్తోత్రములు - మీకుచెల్లింతు
ము॥దీవె॥

2 స్తుతిపితృపుత్రశుద్ధాత్మ- శుభమిచ్చు - స్తుతిపితృపుత్రశుద్ధాత్మ= స్తుతియించునుసర్వ- క్షితిదివ్యసైన్యములు - అతులితంబగు దేవు- డనినిన్ను స్తుతియించు॥దీవె॥

---

## చనిపోయినవారిని
## పాతిపెట్టెడి క్రమము.

నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను. నాయందు విశ్వాసముంచెడివాడు చనిపోయినప్పటికిని జీవించును. మరియు జీవించి నాయందు విశ్వాసముంచెడి ప్రతివాడును ఎన్నటికిని చనిపోడు అని ప్రభువు చెప్పుచున్నాడు. యోహాను, 25వ:26వ.

నారక్షకుడు జీవముతో నున్నాడనియు ఆయన యుకవిూదట భూమిమీద నిలువబడుననియు నేను ఎరుగుదును. ఈ నాయొక్క చర్మము మొదలయినవి కుళ్లిపోయినను, తరువాత నేను నాశరీరములో నుండి పరాత్పరునిచూతును. నా యింద్రియములు నాలో హరించి పోవుచున్నప్పటికిని ఆయనను నా యంతట నేను చూతును; అన్యమైన కన్నులుకావు,

నాకన్నులే ఆయనను చూచును. యోబు, 19ప: 25, 26, 27వ.

మనము యీలోకములోకి యేమియు తేలేము. దీనిలోనుండి యేమియు తీసికొని వెళ్లలేమని స్పష్టమైయున్నది. యెహోవా యిచ్చెను, యెహోవా తీసికొనియున్నాడు. యెహోవా యొక్క నామముస్తుతించబడునుగాక. 1తిమోతి,6ప:7వ. యోబు,1ప:21వ.

స్త్రీకి పుట్టినవాడు స్వల్పకాలము బ్రతుకువాడును శ్రమతోను నిండినవాడునై యున్నాడు. పువ్వువలె పూసి కోయబడుచున్నాడు. ఒకచోటున నిలువక నీడవలె జరిగిపోవుచున్నాడు.

అయినను మిక్కిలి పరిశుద్ధుడవగు ఓ ప్రభువైన దేవా! సర్వశక్తిగల ప్రభువా! మిక్కిలి కరుణగల ఓ పరిశుద్ధరక్షకుడా! నిత్యమరణముయొక్క ఘోర బాధలకు మమ్మును ఒప్పగించకుము.

ప్రభువా! నీవు మా హృదయ రహశ్యములను ఎరిగియున్నావు. కనికరించి మాప్రార్థనకు నీ చెవులను మూసికొనవద్దు. అయినను మిక్కిలి పరిశుద్ధుడవైన ప్రభువా! మమ్మును కాయుము. ఓ సర్వశక్తిగలదేవా! కనికరముగల ఓ పరిశుద్ధ రక్షకుడా!

నీతిగల నిత్య న్యాయాధిపతీ! అవసాన కాలమందు కలిగెడి ఏబాధవల్లనైనను మమ్మును నీ యొద్దనుండి తొలగి పోనియ్యకుము.

సర్వశక్తిగల దేవుడు తన అధిక కృపచేత గతించిపోయిన మన ప్రియ సహోదరుని ఆత్మను తన యొద్దకు చేర్చుకొనననుగ్రహించినాడు గనుక, సమస్తము లోపర్చుకొనుటకు తనకు కలిగియున్న అధిక సామర్థ్యప్రకారము మన దీనశరీరము తనమహిమ శరీరమునకు సమరూపము గలదగునట్లు దానిని మార్చెడి మనప్రభువైన యేసుక్రీస్తుద్వారా నిత్య జీవమునకయ్యెడి పునరుత్థానము కలుగునని నిశ్చయమును దృఢమునైన నిరీక్షణతో వీని శరీరమును మట్టికి మట్టిగాను బూడిదెను బూడిదెగాను దుమ్మును దుమ్ముగాను భూమికి అప్పగించుచున్నాము.

నేను పరలోకమునుండి కలిగిన ఒక శబ్దము వింటిని; అది నాతో చెప్పినదేమనిన ప్రభువునందు చనిపోయినవారు ఇది మొదలుకొని భాగ్యవంతులని వ్రాయుము; వారు తమకష్టములు తీరి విశ్రమించుచున్నారని ఆత్మయును ఆచొప్పుననే పలుకుచున్నది.

## ప్రభువు నేర్పిన ప్రార్థన.

ఆకాశమందున్న మా తండ్రీ! నీపేరు పరిశుద్ధపరచబడునుగాక. నీ రాజ్యము వచ్చునుగాక. నీ చిత్తము ఆకాశమందు ఏలాగో ఆలాగే భూమియందును నెరవేరునుగాక. మా దినాహారము నేడు దయచేయుము. మా యెడల తప్పితములు చేయువారిని మేము క్షమించునట్లు మా తప్పితములు క్షమించుము. శోధనలోనికి మమ్మును రానియ్యక కీడులోనుండి తప్పించుము, ఆమెన్.

## క్రైస్తవ కుటుంబ ధర్మములు.

1 గడచిన రాత్రి అంతయు నిన్నెంతో దయతో కాచి సంరక్షించిన ప్రభువుకు కృతజ్ఞత అగుపర్చుటకును నీ పనులను క్రమముగా చేయునట్లు సహాయము చేయుటకును నీవు నిద్రలేచి యేపనిన్ని చేయకమునుపు నిజదేవుని ప్రార్థించుము.

2 ప్రతి ఉదయ సాయంత్రమున వేదవాక్యమును క్రమముగా చదువుము. పరిశుద్ధాత్మ సహాయమున వేదవాక్యమును చదువుచుంటివేని అవి బంగారుకంటెను చాలా మేలిమి బంగారుకంటెను రమ్యమైనవనియు తేనెకంటెను జుంటితేనె ధారలకంటెను మధురమైనవని అనుభవమువల్ల తెలుసుకొందువు.

3 వేదవాక్యములోనుండు స్తుతి ప్రార్థనలను తీసుకొని దినములోనప్పుడప్పుడు ప్రార్థనచేయుట మంచిది.

4 క్రైస్తవ కుటుంబ ధర్మమును వృద్ధిచేయుటకు భక్తి తాత్పర్యములుగల పుస్తకములను చదువుము.

5 నీకు ఆహారమును దయచేసిన దేవునికి కృతజ్ఞత అగుపర్చుటకును నీకిచ్చిన ఆహారమును ఆశీర్వదించుటకును నీవు భోజనమును చేయకమునుపు దేవుని ప్రార్థించుము.

6 నీవు నీ యిరుగు పొరుగువారికి యేవిధమైన అభ్యంతరముగానుండకుండునట్లు ప్రతిదినము నీ నడతను పరీక్షించుము.

7 మన ప్రవర్తన పవిత్రమవుటకును కుటుంబములో కలహములు మొదలైనవి లేక సుఖసంతోషములు అధికమవుటకును నీయింటనుండు అందరి ఆత్మలు ప్రభువునందు వృద్ధిపొందుటకును ప్రతి ఉదయ సాయంత్రమున కుటుంబ ప్రార్థన క్రమముగా చేయుము.

---

## విగ్రహారాధన వాడుకలు తీసివేయుట.

1 మన ప్రభువైన యేసుక్రీస్తును ఎరుగకమునుపు తలంపు లేకుండ అనేక విగ్రహములను సంభ

ఘనముగా నారాధించుచు చెడ్డ ఆచారములలో చెడ్డ నాడుకలలో అలవాటును పొందియుంటివి. ఇట్టి అలవాటులవల్ల పొందెడి పలువిధములయిన నష్టముల నెరిగి వాటిని విసర్జించకపోయినట్లయిన నీకు లాభమేమి? నీయెడల చాలా ప్రేమనుంచి వ్రయమునకు నష్టమునకు నొప్పి నీమంచిని ఎదురు చూచెడివారు విచారపడక మానరు. ఇప్పుడు నీవు కేవలము విగ్రహారాధన చేయవేమోగాని దానిసంబంధమైన అలవాటులు అప్పుడప్పుడు నీనడతవల్ల కనుబడును. ఏలాగనగ, దైవద్రోహముగా నెంచబడు విగ్రహారాధన సంభ్రమములో గలిసి దాని యర్పితములను తినుచు పసిబాటలవిషయమై సహాయముగానుండి నేను దానిని ఆరాధించననే సాకుచెప్పుదువు, అది సరికాదు. పూర్వకాలపు భక్తులు గొప్ప మర్యాదలు పోవునని, గొప్పనష్టములు సంభవించునని కన్నులారా చూచుచు, అధికారివల్ల విగ్రహారాధన చేయుటకు ప్రేరేపింపబడినను ఒప్పక ప్రస్తుత లాభముల కొరకు వేషధారణమైన నడతలుచూపలేక యథార్థమైన నడతవల్ల నిజదేవుని బయలుపరిచిరి. ఇట్లుండగా స్వల్పముగా నీవు వివాహమందు పంచాంగము చెప్పువాని లగ్నకాలములడుగుట, పేర్బలముల

డు గుట, ఫలాఫలములు విచారించుట,అరి వేణీసుం
డలు తెచ్చుట, బ్రంహ్మాముడులు వేయుట అనే మొ
దలగునవి. కష్ణకాలమందు సంతోషకాలమందు శ
కునములడగి సందేహించుట, చచ్చినవారిపేర నిర్ణ
యప్రకారము దినముచేయుట, దిగదుడుపుచేయుట
అంత్రములు తాయతులు హనుమంతు మొదలగు
రూపములు కట్టుకొనుటఅనే మొదలగువాటిలో న
న్నిటిని లేక కొన్నిటిని చేయుచు నెపములు చెప్పు
చువుగాని కేవలము యిది అజ్ఞానమై యున్నది. ఇట్టి
నడతవల్ల నీకన్న తక్కువ తెలివిగల భార్యాపిల్లలు,
పొరుగువారును నీవును చెడుటకు సందేహము లేదు.
గొంతు పిసుకుటవల్లగాని, రోగమువల్లగాని,హఠా
త్తుగాగాని చచ్చినవాటి మాంసమును తినకూడదు.
ఇంటివా పరిశుద్ధమైన ఆచారమునకు విరోధమును,
నీశరీరమునకు బుద్ధికి బలహీనము కలుగును గనుక తె
లుపబడిన వాటికన్న యింక చెడ్డ నాడుకలనేకము
లున్నవి, వాటినన్నిటిమాని మంచిదియు అనుకూల
మైనదియు పరిపూర్ణమైనదియు ఏదో ఆ దేవుని ఇ
ష్టమును పరీక్షించనిమిత్తము నీ మనస్సు నూతనప
డుటవల్ల రూపాంతరము పొందుము.

## కుటుంబ ప్రేమను గురించి.

2 విచారకరమైన మరియొక అలవాటును తెలుపుదును. ఏమనగా, మనదేశస్థులు భార్యలను సన్మానించుటకు నీతులున్నప్పటికి వాటిని బొత్తిగా తలంచక నాకన్న నాభార్య తక్కువయని అమర్యాదగా బిలుచుచు బలహీనమైనదని ఎరిగి నిర్హేతుకముగా బాధించుచు సణుగుచు గొణుగుచు మృగసంబంధమైన కోపముతో చేతికి యేది దొరికినను అదే తీసుకొని మీదబడి హానికరముగాకొట్టి బొటబొట ఈడ్చి నానా దుర్భాషలాడుచు, అన్నపానాదులయందు వస్త్రాదులయందు భేదపరుచుచు, బుద్ధిచెప్పినను గ్రహించలేని పిల్లను దండించినట్టు దండించుచు, అనేకసార్లు వెళ్లగొట్టుచు, బాహాటముగను సంతోషముగా ప్రేమగా ముచ్చటాడుట తగదనే దేశమర్యాదననుసరించి వెర్రిసిగ్గును కాపాడుకొందురు. ఇది ఎంతో పనికిమాలిన సంగతి. పైని వ్రాయబడినరీతిగా నీ ప్రియకుమార్తెకు జరిగినట్టయిన నోర్చెదవా? భార్యాభర్తలు ఒకరికి ఒకరు సహాయముగా సంతోషముగా ఆదరణగా నుండుటకు జతపర్చబడి దీనికి వేరురీతులుగా జీవించుట ఎటువంటి సంగతి? ఓ సహోదరుడా! నీ భార్యను సర్వదా ఓర్చి ప్రే

మించుటకు దేవవాక్యమెంతగొప్ప కారణములను చూపించును. దానిని చదువుటకు లేక తెలుసుకొనుటకు కొన్ని వివరింతును. క్రీస్తుసభను ప్రేమించి దానిని పవిత్రపరచుటకు తనప్రాణమిచ్చినట్టును ఎవడు తన స్వంతశరీరమును రోసివేయలేనట్టును కఠినముగా చూడ గిట్టదనియు, నిష్ఠురపడగూడదనియు, బలహీనురాలు గనుక సన్మానించవలెననియు, కృపలో భాగస్థురాలు గనుక తెలివితో సహవాసము చేయవలెననియు, తన్ను తానెటువలెనో అట్లు ప్రేమించవలెననియు, తలిదండ్రులనైన విడువవచ్చునుగాని భార్యను విడువగూడదనియు ఎడబాపులేని ప్రేమనుగురించి తెలియపర్చును గనుక ఇందుకువిరోధముగానున్న చెడ్డవాడుకలనువిడిచి నీ భార్యా నీ ప్రార్థనలకభ్యంతరముకాకుండ యోచించి ప్రేమేపణను జాగ్రతగాగైకొనుము.

---

## ఆరాధన క్రమమును గురించి.

ఓ సహోదరుడా! ప్రభువును అంగీకరించకమునుపు ఆరాధనక్రమముయొక్క అలవాటులేదు గనుక అనేకసార్లు నీవు మనోహరముగా ఆత్మ

హారముగానెంచిన దైవారాధనకు వెనుకబడుచు న్నావు. ఆ మొదటి యలవాటు నీయాత్మను పస్తు గానుంచుచున్నది. కనికరముగలదేవుడు యింద కై నీకిచ్చిన యాజ్ఞ ఏమి ఉపదేశించును? ఆరు దిన ములు కష్టపడి పనిచేసి ఏడవ దినమనగా ఆదివార ము పనిచాలించి దానిని పరిశుద్ధముగా నాచరించ వలసినదని. ఇదియే క్రైస్తవుల ఆచారములలో గొ ప్పది. ఈ యాజ్ఞయే శరీరాత్మల పోషణార్థమునకు మూలమైనది. దీనినలక్ష్యపెట్టుచున్నారు. ఇట్టివా రెంత గొప్పనష్టమును పొందుచున్నారు. సోమరితన ముగా కాలము గడుపువారి లేమి త్వరపడివచ్చెడి దొంగవలెను, ఆయుధస్థునివలెను వచ్చును. గనుక సహోదరుడా! జాగ్రతపడి, శరీరాత్మల విషయమై చురుకుతనములు పొంది దైవారాధనను అధికముగా ఆశించుము. అది గౌరవపరుచుటకు నీవును నీ యిం టివారును శుభ్రమైన వస్త్రములను ధరించుకొని, వెంట్రుకలు చక్కగా దువ్వుకొని చదవరులైనను వేదగ్రంథములను చేతబట్టుకొని, నేర్చుకొనిన వేద వాక్యములను ధ్యానించుకొనుచు మిక్కిలి ఒద్దికగా మార్గముననడిచి గుడిలో ప్రవేశించి ఏవిధమైన సం దడి జరగకుండా యాపత్తుమనస్సును బోధవాక్య

ముత్తట్టును మలిపి ఆలకించి దేవుని మహిమకొరకు కీర్తనలుపాడి ఆరాధన ముగింపు కాగానే మర్యాదగా ఇల్లుచేరి పరిశుద్ధమైన దినమునే జ్ఞాపకములోనుండి జారిపోకనుంటిరా, నీవును నీ యింటివారును ధన్యులై ఇరుగు పొరుగువారి మేలునకు ప్రేరేపణగా నుందురు.

---

ప్రియసోదరీ! నీయెడల నీభర్తయొక్క విధాయకమును తెలిపితిని దీనిని చదువుచు లేక వినుచు నుండగా భర్తయెడల నీవిధాయకమును జ్ఞాపకము చేసుకొనుటకును నీబిడ్డలవిషయము ఇంటివిషయములయందు క్రమముగా నడుచుకొనుటకును సహాయముగా కొంతవివరింతును.

---

## స్త్రీ విధేయతనుగురించి.

1 నీ భర్తకు ప్రభువునకువలె లోబడవలెనని యీ క్రీస్తు సభకు శిరస్సైనట్టు ఆయన నీ దేహాసంర

క్షకుడనియు, నీకు శిరస్సనియు, సభ క్రీస్తుకు ఏలాగు లోబడియున్నదో ఆలాగు అన్నిటిలో లోబడవలెననియు, భయపడవలెననియు, వాక్యమునకు లోబడనివాడైనను నీమంచి ప్రవర్తనవల్ల రాబట్టుకొనవలెననియు, అలంకారము వెలుపటిదే కాదు, దేవుని దృష్టిలో ఆత్మస్థితి అట్లుండవలెననియు, పరిశుద్ధ స్త్రీల మాదిరిననుసరించి, శారా అబ్రాహామును ప్రభువని పిలిచి లోబడినట్లు లోబడవలెననియు, మిక్కిలి మర్యాదతో లోబడి ప్రేమగాజీవించుటకు గుణవతివైయుండుము. అప్పుడు నీవెల ముత్యములకంటె అత్యధికమైనది. నీభర్త నమ్మిక నీయందుండును. తిరుగుబాటుచేసి జగడము చేయుదానవైయుంటివా, నీభర్తయొక్క పక్కలోనుండు మానరాని కుళ్లుపుండువలె శ్రమపరుతువు. పొరుగువారు అసహ్యపడుదురు. నీభర్త ఘనమునకు బదులు అవమానమును పొందును.

2 బిడ్డలను పరామర్శించుటయందు నీజాగ్రత అధికమైయుండవలెను. చిన్నతనములో మంచిపునాదివేయవలెను. ఇట్లు వేయుటకు, సహోదరీ, నీవును నీభర్తయును పిల్లలకు బప్తిస్మమిప్పించెడి కాలమందు దేవునియెదుట సంఘముయెదుట బోధకుని

తో దేవుని పరిశుద్ధ చిత్తప్రకారము కాపాడుదునని. పాపములను రోసివేతునని మాటయిచ్చి యుండవలెను. అనేకులలో నింతగొప్పవిషయము మరచిపోబడుచున్నది. కొందరిపిల్లలను విచారించితే యేమియు నెరుగనివారుగా కనుబడుచున్నారు. అయ్యో! దేవునియెదుటచేసిన వాగ్దత్తము ఇంతవేగిరముగా మరిచిపోవచ్చునా! మనము ఒక గొప్పమనిషికి మాటయిచ్చినట్టైన తప్పిపోవుటయందు విచారమును భయమును కలుగునుగదా? మనముమాటఇచ్చిన దేవుడు అన్నిటిలో గొప్పవాడును మరువనివాడును గనుక ఆవిషయములో మనము తప్పిపోక వారు గ్రహించెడి కాలమురాగానే, పరిశుద్ధమతమును దేవునిభయమును నేర్పవలెను. ఎందుకనగ, తెలివికి మూలము అదే. నీనడతవల్ల రక్షకుని ప్రేమను ఆయన శాంతాదిగుణములను నేర్పుచు, ఆడవారు మొగవారు అనే భేదములేకుండ వారిని క్రమముగా బడికిపంపి వేదము చదువునట్లు చేయుము. రాత్రింబగళ్లు నిన్ను నీవారిని కాపాడిన దేవుని నిండుమనస్సుతో వారితోకలసి ఉదయ సాయంకాలములయందు ప్రార్థించుము. నీవు సత్క్రియలు చేయుచు వారు చేయుట నేర్పుము. నీవు గుడి

లో చందాకొరకు ఏమైనను ఇత్తువుగదా? ఈమం చి అలవాటు వారికి గలుగగలందులకు వారిచేతితో వేయనిమ్ము. నీవు అన్యస్త్రీలలోనుండి ప్రత్యేకించబడినట్టు వారిపిల్లలవలె నీపిల్లలు దిసమొలలతోను చిఱ్ఱవెంట్రుకలతోను ఒళ్లంతా మురికి చారికలతోను ఉండకుండ జాగ్రతచేసి వారి గొప్పస్థితిని ఆశించి ప్రభువుమహిమ పరచబడునట్లు పెంచుము. అప్పుడు నీవు భాగ్యవతివై యుందువు.

---

## దేహారోగ్యము.

దేహారోగ్యముకంటె జనులకు ప్రియమైనదియు, అగత్యమైనదియు ప్రపంచమునందు మరియొకటిలేదు. దేహములోని యంత్రములు క్రమముగానుండినయెడల దేహారోగ్యము కలుగును. అవి క్రమము తప్పినతోడనే దేహాస్వాస్థ్యముడుగును. మూఢులగు జనులు తమకుండు దేహాస్వాస్థ్యమును పలుకారణములచే పోగొట్టుకొని అందువలన కలుగు అవస్థలును, తొందరులును సహించబాలక « మేముండుస్థలము అచ్చిరాలేదు, దేవుడు మాయందు దయతప్పినాడు. మేమిచ్చటకువచ్చి కాలఫలమేమో తెలియదు, ఇచ

టకు మేము కాపురమువచ్చినదినము మొదలు వైద్యు డు మాయింటికిరాని దినములు లేవు. నాభార్యకు తిమురువాయువు కనుపించి కాలుచేతులు పడినవి, నాకు పడిశము తలనొప్పి లేనిదినములులేవు, నా బిడ్డలు జ్వరమువలన బాధపడుచున్నారు. ఇది మా మరాదృష్టము, ఈసంకటములు మమ్మును ఎప్పుడు విడిచిపోవునో" అని మూఢులగుజనులు చెప్పెదరు. ఓ క్రైస్తవ సహోదర, సహోదరీ! ఇందునకు కారణమేమో నీకు తెలుసునా? అనేకములగు కారణములు కలవు వాటిలోనొకటి ఇల్లుశుభ్రముగానుంచకపోవుటయే గనుక క్రైస్తవులమగు మనము మూఢులవలె వెఱ్ఱితలంపులు కలిగియుండక ఈదిగువన గుపరచురీతులననుసరించి మాయిండ్ల విషయమై మిగులజాగ్రతగానున్నయెడల తప్పక దేహారోగ్యమును సంపాదించుకొనెదము.

1 మనము కాపురముండుఇండ్లు తేమలేనిస్థలములలో కట్టవలెను.

2 నిప్పురగులుటవలన శుద్ధవాయువు చెడును గనుక పడక గదులలో రాత్రి నిప్పు ఉంచగూడదు.

3 మనయిండ్లను దినమునకు రెండు, మూడు

సాగ్లు ఊడ్చుచు వారమునకొకసారి అలుకుచుండవలెను.

4 రంగువేయుట, కంచరిపని, తోళ్లుఊనుట, పశువులను కోయుట మొదలగు పనులను ఇండ్లలో జరపకూడదు.

5 ఇండ్లలో పశువులను కట్టరాదు. విధిలేక కట్టుకొనినయెడల దినదినము శుభ్రముచేసి ఆ పేంట పోగులు దూరముగా పోయుచుండవలెను.

6 పిల్లలయినను, పెద్దలయినను ఇండ్లలోగాని, వాకిళ్లలోగాని మూత్రపురీషములు చేయరాదు.

7 చేపలు మొదలైనవాటిని కడిగిననీళ్లు, చింపి గుడ్డలు, పగిలినకుండపెంకులు, ఇండ్లను ఊడ్చినపెంటలు మొదలగు నానావిధములైన యశుద్ధ పదార్థములను ఇండ్లకుసమీపములో వేయకూడదు.

# ప్రథమబోధిని.

---

## మొదటి నెల.

---

### దేవుని గురించినది.

౧ ప్రశ్నము. నిన్ను చేసినవాఁడెవడు?
ఉత్తరము. నన్ను చేసినవాఁడు దేవుడు.

౨ ప్ర. దేవుడు నిన్నుగాక మఱియేమి చేసెను?
ఉ. దేవుడు అన్నిటిని చేసెను.

3 ప్ర. దేవునిగురించి మనకు ఏ గ్రంథము చెప్పుచున్నది?
ఉ. దేవునిగురించి మనకు బైబిలు అనేగ్రంథము చెప్పుచున్నది.

౪ ప్ర. బైబిలు అనేది యెవనిమాటయయి యున్నది?
ఉ. బైబిలు అనేది దేవుని మాటయయి యున్నది.

౫ ప్ర. దేవుడు ఎక్కడ ఉన్నాడు?
ఉ. దేవుడు అంతటను ఉన్నాడు.

౬ ప్ర. మనము ఎందుచేత దేవుని చూడ లేము?

ఉ. దేవుడు ఆత్మగనుక మనము ఆయనను చూడలేము.

౭. ప్ర. ఆత్మ అనగా ఏమిటి?

ఉ. ఆత్మ అనగా కానరాకనుండునది.

౮. ప్ర. దేవునికి ఆది అంతముండెనా?

ఉ. దేవునికి ఆది అంతము ఉండదు.

౯ ప్ర. దేవుడెట్టి శక్తిగలవాడు?

ఉ. దేవుడు సర్వశక్తిగలవాడు.

౧౦ ప్ర. దేవుడు నిన్ను ఎల్లప్పుడును చూచుచున్నాడా?

ఉ. దేవుడు నన్ను రాత్రియందు పగటియందును చూచుచున్నాడు.

౧౧ ప్ర. నీవు చేసేది అంతయును దేవుడు ఎఱుగునా?

ఉ. నేను చేసేదంతయును దేవుడు చూచుచున్నాడు; నేను చెప్పేదంతయును వినుచున్నాడు; నేను తలంచేదంతయును తెలిసికొనుచున్నాడు.

౧౨ ప్ర. దేవుడు పరిశుద్ధుడా?

ఉ. దేవుడు పరిశుద్ధుడును, న్యాయస్థుడును మంచివాడునై యున్నాడు.

౧౩ ప్ర. ఒక్క దేవుడు మాత్రమే ఉన్నాడా?

ఉ. ఒక్క దేవుడు మాత్రమే వున్నాడు.

---

## దూతలు దయ్యములును.

౧౪ ప్ర. దూతలు అనగా ఎవరు?

ఉ. దూతలు దేవుని చిత్తప్రకారము జరిగించెడి మంచి ఆత్మలై యున్నారు.

౧౫ ప్ర. దయ్యములు అనగా ఎవరు?

ఉ. దయ్యములు పూర్వము మంచివారుగా ఉండి, యిప్పుడు చెడ్డ ఆత్మలై యున్నారు.

---

## రెండవ నెల.

---

## మనుష్యుని పుట్టుక.

౧౬ ప్ర. దేవుడు అన్నిటిని ఎట్లుగా చేసెను?

ఉ. దేవుడు అన్నిటిని ఏమియును లేనప్పుడు తన మాటవల్ల చేసెను.

౧౭ ప్ర. దేవుడు తాను చేసినవాటిని ఎట్లుగా భద్రము చేయుచున్నాడు?

ఉ. దేవుడు తాను చేసిన వాటిని కాపాడి యేలుచున్నాడు.

౧౮ ప్ర. మొదటి స్త్రీ పురుషులు ఎవరు?

ఉ. ఆదాము మొదట పురుషుడు, హవ్వ మొదటి స్త్రీ.

౧౯ ప్ర. మనుష్యుడు ఏ రెండు భాగములు కలవాడు?

ఉ. మనుష్యుడు శరీరమును ఆత్మయును కలవాడు.

౨౦ ప్ర. దేవుడు ఆదాముయొక్క శరీరమును దేనితో చేసెను?

ఉ. దేవుడు ఆదాము శరీరమును నేలమట్టితో చేసెను.

౨౧ ప్ర. జీవాత్మ అనగా ఏమిటి?

ఉ. జీవాత్మ అనగా శరీరములో నివసించు ఆత్మయై యున్నది.

౨౨ ప్ర. జీవాత్మ ఏమి చేయగలదు?

ఉ. జీవాత్మ తలంచగలదు, మఱియు ఇది మంచిది, ఇది చెడ్డది యని తెలిసికొనగలదు.

౨౩ ప్ర. శరీరముకన్న జీవాత్మ ఎందుచేత ఎక్కువైనది?

ఉ. జీవాత్మ ఎల్లప్పుడును బ్రతుకును గనుక శరీరముకన్న ఎక్కువైయున్నది.

౨౪ ప్ర. ఆదాము ఎవని పోలికగా చేయబడెను?

ఉ. ఆదాము దేవునివలె పరిశుద్ధుడుగాను సంతోషము కలవాడుగాను చేయబడెను.

౨౫ ప్ర. ఆదామును హవ్వయును ఎక్కడ ఉంచబడిరి?

ఉ. ఆదామును హవ్వయును ఏదెను తోటలో ఉంచబడిరి.

---

## మనుష్యుడు పాపములో పడి పోవుట.

౨౬ ప్ర. ఆదామును హవ్వయును పరిశుద్ధులుగానే ఉండిరా?

ఉ. ఆదామును హవ్వయును పాపాత్ములైరి.

౨౭ ప్ర. పాపము అనగా ఏమిటి?

ఉ. పాపము అనగా దేవుని ఆజ్ఞలను మీరుట.

౨౮ ప్ర. ఆదామును హవ్వయును చేసిన పాపము ఏమిటి?

ఉ. ఆదామును హవ్వయును తినవద్దన్న పండును తినడము.

౨౯ ప్ర. ఆదామును హవ్వయును దానిని తినుమని యేది ఎక్కులు పెట్టెను?

ఉ. దయ్యము, పాపముయొక్క రూపమెత్తి, ఆదామును హవ్వను ఎక్కులు పెట్టెను.

3౦ ప్ర. ఆదాములోను హవ్వలోను తినవద్దన్న పండును తినుటవల్ల ఏమి మార్పుకలిగెను?

ఉ. ఆదామును హవ్వయును తమకు కలిగిన దేవుని పోలికను పోగొట్టుకొనుట చేతగనిమార్పు కలిగెను.

---

మూడవ నెల.

---

3౧ ప్ర. ఆదామును హవ్వయును చేసిన పాపమువల్ల ఈలోకమునందు ఏమి కీడులు సంభవించెను!

ఉ. పాపమువల్ల కష్టమును, నొప్పియును, చావును సంభవించెను.

3౨ ప్ర. ఆదామును హవ్వయును చచ్చినతర్వాత దేనికి తగియుండిరి?

ఉ. ఆదామును హవ్వయును నిత్య శిక్షకు తగి యుండిరి.

---

అందఱు పాపము చేసియున్నారు.

౩౩ ప్ర. నీవు ఎటువంటి హృదయముతో పుట్టి నావు?

ఉ. నేను పాపపు హృదయముతో పుట్టినాను.

౩౪ ప్ర. నీవు ఏ యే విధములుగా పాపము చేసి యున్నావు?

ఉ. నేను తలంపువలనను మాటవలనను క్రియవలనను పాపము చేసియున్నాను.

౩౫ ప్ర. పాపము చేసినవారు ఎవరు?

ఉ. అందఱు పాపము చేసిన వారే.

౩౬ ప్ర. మన క్రియలలో ఒకటియైనను కేవలము మంచిది కాదా?

ఉ. మనము చేసెడి క్రియలలో నొకటియైన కేవలము మంచిదికాదు.

౩౭. ప్ర. పాపమునకు తగియున్న శిక్ష యేమిటి?

ఉ. పాపమునకు తగిన శిక్ష నిత్య మరణమైయున్నది.

---

మనుష్యునియొక్క విడుదలను గుఱించినది.

3౭ ప్ర. మనుష్యులకు రక్షకుడు ఎవడు?

ఉ. దేవుని కుమారుడును మన ప్రభువును అయిన యేసుక్రీస్తు మనుష్యులకు రక్షకుడై యున్నాడు.

3౯ ప్ర. యేసుక్రీస్తు మనలను రక్షించుటకు ఏమి ఆయెను?

ఉ. యేసు క్రీస్తు మనలను రక్షించుటకు మనుష్యుడాయెను.

౪౦ ప్ర. యేసు క్రీస్తు ఏలాగున పుట్టెను?

ఉ. యేసు క్రీస్తు పరిశుద్ధాత్మశక్తివల్ల కన్నెయైన మరియకు పుట్టెను.

౪౧ ప్ర. యేసు క్రీస్తు ఇతర మనుష్యులవలె పాపాత్ముడా?

ఉ. యేసు క్రీస్తు బొత్తుగా పాపము లేనివాడు.

౪౨ ప్ర. యేసు క్రీస్తు ముప్పది సంవత్సరముల యీడుగల వాడైనప్పుడు ఆయన యేమిచేసెను?

ఉ. యేసు క్రీస్తు అంతట బోధించుచు తిరిగెను.

౪3 ప్ర. యేసు క్రీస్తు తన బోధను ఏలాగున బలపఱిచెను?

ఉ. యేసు క్రీస్తు రోగులను బాగుచేయుట వల్ల

ను చచ్చిపోయిన వారిని బ్రతికించుటవల్లను తన బోధను బలపఱిచెను.

౪౪ ప్ర. యేసు మనకు బదులుగా ఏమి శిక్షపొందెను?

ఉ. యేసు మనకు బదులుగా మరణశ్రమ పొందెను.

౪౫ ప్ర. యేసు చనిపోవకపోయినట్టయిన మనుష్యులందఱికి ఏమి సంభవించును?

ఉ. యేసు చావక పోయినట్టయిన మనుష్యులందఱికి నరకము సంభవించును.

---

## నాలవ నెల.

౪౬ ప్ర. యేసు క్రీస్తు ఏ ప్రకారముగా చంపబడెను?

ఉ. యేసు క్రీస్తు మేకులతో సిలువకు కొట్టబడి చంపబడెను.

౪౭ ప్ర. యేసు క్రీస్తు మూడవ దినమందు ఏమి చేసెను?

ఉ. యేసు క్రీస్తు మూడవ దినమునందు చనిపోయిన వారిలోనుండి లేచెను.

౮౮ ప్ర. యేసు క్రీస్తు అటు తర్వాత ఎక్కడికి వెళ్లెను?

ఉ. యేసు క్రీస్తు ఆకాశమునకు ఎక్కి వెళ్లెను.

---

## రక్షణ మార్గము.

౮౯ ప్ర. రక్షింపబడుటకు ఒకటే అయియున్న మార్గము ఏది?

ఉ. రక్షింపబడుటకు యేసు క్రీస్తే మార్గమైయున్నాడు.

౯౦ ప్ర. యేసు ఎవరిని రక్షించును?

ఉ. యేసు పశ్చాత్తాపము పొంది తనయందు విశ్వసించెడివారిని రక్షించును.

౯౧ ప్ర. పశ్చాత్తాపము పడుట అనగా ఏమిటి?

ఉ. పశ్చాత్తాప పడుట అనగా, పాపము చేసినందుకు దుఃఖపడి, దానిని విడిచి పెట్టుటయే.

౯౨ ప్ర. నీవు ఎవరితో నీ పాపమును చెప్పి యొప్పుకొనవలెను?

ఉ. నేను నా పాపములను దేవునితో చెప్పి యొప్పుకొనవలసినది.

× ౩ ప్ర. నీ పాపముల నిమిత్తము నీవు ఏమి అడుగుకొనవలెను?

ఉ. నేను నా పాపముల నిమిత్తము క్షమాపణ అడుగుకొన వలెను.

× ౪ ప్ర. నీవు ప్రతి సంగతి ఎవని పేరట దేవుని అడుగుకొన వలెను?

ఉ. నేను ప్రతి సంగతి యేసు క్రీస్తు పేరట దేవుని అడుగుకొన వలెను.

× ౫ ప్ర. క్రీస్తునందు విశ్వాసము ఉంచుట అనగా ఏమిటి?

ఉ. క్రీస్తునందు విశ్వాసము ఉంచుటఅనగా, రక్షణకొఱకు ఆయనయందు మాత్రమే నమ్మిక ఉంచుట.

× ౬ ప్ర. విశ్వాసుల పాపములు ఎవని మీద ఉంచబడి యున్నవి?

ఉ. విశ్వాసుల పాపములు క్రీస్తు మీద ఉంచబడి యున్నవి.

× ౭ ప్ర. మనము విశ్వసించుటవల్ల ఎవనిపుణ్యమును పొందుదుము?

ఉ. మనము విశ్వసించుట వల్ల యేసు క్రీస్తు యొక్క పుణ్యమును పొందుదుము.

౫౮ ప్ర. మనము ఎవని సహాయము వల్ల పశ్చాత్తాపము పొంది విశ్వసించ గలము?

ఉ. మనము దేవుని పరిశుద్ధాత్మ సహాయము వల్ల పశ్చాత్తాపమును పొంది విశ్వసించ గలము.

౫౯ ప్ర. పరిశుద్ధాత్మ సహాయము ఏలాగున పొందవచ్చును?

ఉ. దేవుని అడుగుకొనుటచే పరిశుద్ధాత్మ సహాయము పొందవచ్చును.

౬౦ ప్ర. నిజమైన విశ్వాసులు ఏలాగు తెలిసికొన బడుచున్నారు?

ఉ. నిజమైన విశ్వాసులు యేసు యాజ్ఞలను కాపాడుట వల్ల తెలిసికొన బడుచున్నారు.

---

## అయిదవ నెల.

---

### దేవుని యెడల జరిగించ వలసిన విధులు.

౬౧ ప్ర. నీవు దేవుని యందు ఏలాగున ప్రేమ ఉంచవలెను?

ఉ. నేను దేవుని యందు నా యావత్తు హృదయముతో ప్రేమ ఉంచ వలెను.

౧౨ ప్ర. నీవు ఎవని మాత్రము ఆరాధించవలెను?

ఉ. నేను ఒక్క నిజమైన దేవుని మాత్రమే ఆరాధించ వలెను.

౧౩ ప్ర. అజ్ఞానుల దైవములు ఎటువంటివి?

ఉ. అజ్ఞానుల దైవములు కేవలము మూగ విగ్రహములై యున్నవి.

౧౪ ప్ర. విగ్రహములను ఆరాధించెడివారిని దేవుడు ఏమి చేయును?

ఉ. దేవుడు విగ్రహములను ఆరాధించెడివారిని శిక్షించును.

౧౫ ప్ర. నీవు మంచి ముహూర్తములనే కాని, శకునములనే కాని, అనుసరింపవలెనా?

ఉ. అనుసరింప కూడదు.

౧౬ ప్ర. మనము రోగులమై యున్నప్పుడు ఎవని సహాయము ముఖ్యముగా వెదక వలెను?

ఉ. మనము దేవుని సహాయము ముఖ్యముగా వెదక వలెను.

౧౭ ప్ర. నీవు దేవుని పేరు ఏలాగు వాడుక చేయకూడదు?

ఉ. నేను దేవుని పేరు వ్యర్థముగా వాడుక చేయకూడదు.

౧౮ ప్ర. విశ్రాంతి దినమును ఏలాగు ఆచరించ వలెను?

ఉ. నేను విశ్రాంతి దినమును పరిశుద్ధముగా ఆచరించవలెను.

---

## మనుష్యుల యెడల జరిగించ వలసిన విధులు.

౧౯ ప్ర. నీవు ఇతరులను ఏలాగు ప్రేమించవలెను?

ఉ. నేను ఇతరులను నావలెనే ప్రేమించ వలెను.

౨౦ ప్ర. దేవుడు మనుష్యులను కులములు కలవారినిగా చేసినాడా?

ఉ. లేదు; దేవుడు మనుష్యుల నందరిని ఏక రక్తము గలవారినిగా చేసినాడు.

౨౧ ప్ర. నీ తలిదండ్రుల యెడల నీవు జరిగించ వలసిన విధి యెట్టిది?

ఉ. నా తలిదండ్రులయెడల నేను ప్రేమ ఉంచి, వారికి లోబడ వలెను.

౨౨ ప్ర. చేయరానిది నీకు ఆజ్ఞాపించి నట్టయిన నీవు చేయ వలసిన దేనా?

ఉ. నాకు చేయరానిది ఆజ్ఞాపించ బడినట్టయిన నేను దానిని చేయ కూడదు.

౨౩ ప్ర. నీవు జగడ మాడుట కాని, దెబ్బలాడుటకాని జరిగించ వచ్చునా?

ఉ. జగడమాడుటకాని, దెబ్బలాడుటకాని జరిగించకూడదు.

౨౪ ప్ర. జనులు నీకు కీడు చేసినట్టయినను నీవు ఏమి చేయ వలెను?

ఉ. నేను కీడునకు మేలు చేయ వలెను.

౨౫ ప్ర. బూతులు పలుక వచ్చునా?

ఉ. బూతులు దేవునికి అసహ్యములై యున్నవి గనుక పలుక కూడదు.

---

## ఆరవ నెల.

౨౬ ప్ర. నీవు ఏమి తీసికొన కూడదు?

ఉ. నేను నాది కానిది తీసికొన కూడదు.

౨౭ ప్ర. నీవు ఎప్పుడైనను అసత్యము లాడవచ్చునా?

ఉ. నేను ఎన్నడైనను అసత్యము లాడకూడదు.

౭౮ ప్ర. అసత్యవాదు లందఱి భాగము ఎక్కడ ఉన్నది?

ఉ. అసత్యవాదు లందఱి భాగము నిప్పులమడుగులో ఉన్నది.

౭౯ ప్ర. నీవు దేనిని ఆశించ కూడదు?

ఉ. నేను ఇతరుల వస్తువులను ఆశించ కూడదు.

౮౦ ప్ర. నీవు ఎల్లప్పుడును పూర్వాచారము చొప్పున నడవ వలెనా?

ఉ. ఏదియైనను ఒక వాడుక మంచిదైనట్టయిన నేను దానిని వెంబడించ వలెను. చెడ్డదియైన నేను దానిని విడిచి పెట్టవలెను.

---

## ప్రార్థన.

---

### సువార్త వ్యాపకత్వము.

౮౧ ప్ర. నీవు తుదకు ఎన్ని మాఱులు ప్రార్థించవలసినది?

ఉ. నేను తుదకు రేపు మాపును ప్రార్థించ వలసినది.

౮౨ ప్ర. మనము రక్షించ బడుటకు అనేకమతములు కలవా?

ఉ. మనము యేసు క్రీస్తు యొక్క మతముచేత మాత్రమే రక్షించ బడ గలము.

౮౩ ప్ర. మనము మన నడతవల్ల క్రీస్తు మతము వ్యాపించు లాగున ఏలాగు సహాయము చేయవచ్చును?

ఉ. మనము పరిశుద్ధముగా నడుచుటవల్ల క్రీస్తు మతమును వ్యాపించులాగున సహాయముచేయ వచ్చును.

౮౪ ప్ర. సువార్తను తెలుపగలందులకు మనము ఇంక ఏమి చేయ వచ్చును?

ఉ. మనము క్రైస్తవ మతమును ఇతరులకు చెప్పి దాని వ్యాపకత్వము నిమిత్తము ప్రార్థించ వచ్చును.

---

## మరణము, న్యాయ విమర్శ.

౮౫ ప్ర. నీవు చనిపోయిన తరువాత నీయాత్మ ఎక్కడికి వెళ్లును?

ఉ. నేను చనిపోయిన తరువాత నా యాత్మ పరలోకమునకు వెళ్లును.

౮౬ ప్ర. చివర దినమునందు మనుష్యులందఱిని ఎవ్వడు విమర్శింపును?

ఉ. చివర దినమునందు యేసు క్రీస్తు మనుష్యులందఱిని విమర్శించును.

౮౭ ప్ర. నరకమునకు ఎవరు పంపబడుదురు?

ఉ. దుర్మార్గులును దేవుని మఱచువారందఱును నరకమునకు పంపబడుదురు.

౮౮ ప్ర. నరకము ఎటువంటి స్థలమై యున్నది?

ఉ. నరకము నిత్య వేదనమై యున్నది.

౮౯ ప్ర. నీవు సంతోషముగా ఉండుటకు వెతక వలసినది యేమిటి?

ఉ. నేను నరకమునుంచి రక్షించబడి మోక్షరాజ్యములో ప్రవేశించుటకు వెతక వలసినది.

౯౦ ప్ర. నీతిమంతులు యెక్కడికి వెళ్లుదురు? ఏమి పొందుదురు?

ఉ. నీతిమంతులు దేవుని యొద్దికి వెళ్లి నిత్యసుఖమును పొందుదురు.

---

## కీర్తనల మొదటి వాక్యములు.

కీర్తనల సంఖ్య.